# చెరుకూరి భావనా స్రవంతి

## గేయ గుచ్ఛము



# చెరుకూరి వీరయ్య

# అంకితం

1963-1989 మధ్యకాలంలో నేను శ్రీశైలం, నాగార్జునసాగర్, సర్ ఆర్థర్ కాటన్ బ్యారేజి, బలిమెల మొదలగు ప్రాజెక్టులలో ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తున్నప్పుడు, అక్కడ ప్రతిచోటా సాంస్కృతిక సంస్థలను నెలకొల్పి, ఎన్నో వైజ్ఞానిక కార్యక్రమాలను నిర్వహించటం జరిగింది. ఆ కార్యక్రమాలకు సందర్భోచితంగా రచించి ఔత్సాహికులైన గాయనీ గాయకులచే పాడించిన గేయాలనే సంకలనంజేసి ఇలా పుస్తకరూపంలో ప్రచురిస్తున్నాను. వీటిలోని కొన్ని గేయాలు పలు సందర్భాలలో 'ఆకాశవాణి'లో కూడా ప్రసారం చేయబడినవి.

ఆనాటి సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణలో నాకు చేదోడు వాదోడుగా నిల్చి, అమూల్యమైన సలహాలిస్తూ, తన సహాయ, సహకారాలందించిన నా జీవిత భాగస్వామిని శ్రీమతి లలితకు ప్రేమతో ఈ గేయాల్ని మా వైవాహిక స్వర్ణోత్సవ పురస్కారంగా అంకితమిస్తున్నాను.

14, ఏప్రిల్ 2004,

చెరుకూరి వీరయ్య

# కృతికర్త శ్రీ చెరుకూరి వీరయ్య పరిచయం

జన్మించింది: 14 జూన్, 1931లో కృష్ణాజిల్లా, పామర్రు మండలం, జమీగొల్వేపల్లి గ్రామంలో, ప్రాధమిక,
ఉన్నత విద్యాభ్యాసం: జమీగొల్వేపల్లి, పామర్రు, మచిలీపట్టణంలో,
ఇంజనీరింగ్ విద్యాభ్యాసం : కాకివాడ ఇంజనీరింగ్ కాలేజిలో (1950-54)
ఉద్యోగ ధర్మనిర్వహణ: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యుచ్ఛక్తి మరియు నీటిపారుదల శాఖలలో,
కార్యస్థలాలు : మాచ్కండ్ జలవిద్యుదుత్పాదక పథకం (గరివిడి), నాగార్జునసాగర్ ప్రాజెక్టు, శ్రీ శ్రీశైలం ప్రాజెక్టు సర్ ఆర్థర్ కాటన్ బ్యారేజి, బలిమెల ప్రాజెక్టు, శ్రీశైలం కుడిగట్టుకాలువ నంద్యాల, చిన్నతరహా నీటిపారుదల పథకాల పరిశీలన (కరీంనగర్) మొదలగునవి.
పదవీ విరమణ : 1989 జూన్లో సూపరింటెండింగ్ ఇంజనీరుగా, పురస్కారాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మరియు ఇన్స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్ (ఇండియా), హైదరాబాదు కేంద్రంవారు సంయుక్తంగా బహూకరించిన 1989వ సంవత్సరపు ఉత్తమ ఇంజనీరు' పురస్కారాన్ని అందుకున్నారు.
ఇండో-డచ్ ప్రాజెక్టుకు 1990-93లోనూ, ఇంజనీరింగ్ స్టాఫ్ కాలేజ్ ఆఫ్ ఇండియాకు 1994-95లో కన్సల్టెంట్గా పనిచేశారు. 1996-97లో రాష్ట్ర ప్రభుత్వానికి నీటిపారుదల రంగంలో సలహాదారుగా వ్యవహరించారు.
పుస్తకపఠనం, పద్య, గేయరచన, సాంస్కృతిక కార్యక్రమాలపై ఆసక్తి.
ఇతర ముద్రిత రచనలు : చెరుకూరి విరిజల్లులు (పద్యకావ్యం) తెలుగుదేవర - కాటన్ దొర (జీవితచరిత్ర)
ప్రస్తుత కాలక్షేపం : సాగునీటి రంగానికి సంబంధించిన వివిధాంశాలపై వార్తాపత్రికలకు వ్యాసరచన, సమావేశాలలో పాల్గొనటం.
ప్రస్తుత నివాసం : ప్లాటు నంబరు 211, 'లాలిత్య' ఎమెరాల్డ్, అమృతాహిల్స్, పంజాగుట్ట, హైదరాబాదు - 500082. ఫోన్ నెంబరు 040-23402237

# విషయసూచిక

# భరతమాత

సీ॥ శీతన శ్రేణి శిరమున నిండుగాఁ
　　　　దాల్చిన మల్లెపూదండగాగ,
బుధజన సంసేవ్య పూత భాగీరథి,
　　　　గళమున శోభిల్లు కంటే కాగ,
ఘన వనాచ్ఛాదిత కమనీయ వింధ్యాద్రి,
　　　　కటిసీమ నలరు మేఖలయె కాగ,
జలధుల మూడింట జలకేళి సల్పెడు
　　　　కన్యాకుమారి పాగడముఁగాగ,

గీ॥ గౌతమీ, కృష్ణ కావేరి, గంగ, సింధు,
పుణ్యజీవనదీజలన్తన్యమొసగి,
పదిపదులకోట్ల బిడ్డల పదిలముగను,
పెంచి, పోషించుకొనుచున్న విమలచరిత,
బహుళ సద్గుణ సముపేత, భరతమాత.

‘శ్రీశైల సాంస్కృతిక సమితి’ ప్రారంభోత్సవ సందర్భమున

సీ॥ కమనీయ, రమణీయ కవనమ్ము సృష్టించి
వాసికెక్కిన కవి వర్యులార!
నాట్య, నాటక కళానైపుణి సాధించి
నవజీవనముఁజూపు నటకులార!
సంగీత, సాహిత్య, శాస్త్ర, శిల్పములకు
నవ్యత గూర్చిన భవులార!
వివిధ రంగములందు విఖ్యాతి నార్జించి
సార్థక జన్ములౌ సదయులార!

గీ॥ కనుడు! ‘శ్రీశైల సాంస్కృతిక సమితి’ యిల
రూపుదాల్చెడు పండుగరోజు నేడు
చిరము వర్ధిలి, జగతికి సేవజేయ,
నందజేయుడు దీవెన లార్యులార!

(1966 సెప్టెంబర్)

## 'కవికోకిల' జాషువాగారి సన్మానసభ

### గేయం

ప॥ స్వాగతమో! కవికోకిల! స్వాగతమోయీ!

'నవయుగ కవి చక్రవర్తి'! స్వాగతమోయీ! ॥స్వా॥

మధుర కావ్యసుమములలో మకరందము చిలికించిన

'మధుర శ్రీనాథ'! నీకు స్వాగతమోయీ! ॥స్వా॥

నిరుపేదల గుండెలలో నిండియున్న వెతలన్నీ

నీ కవితావస్తువులై నెగడెనోయి 'కవిదిగ్గజ'! ॥స్వా॥

ధాత్రీజనములు పొగిడిన, తాజమహల్ అందములో,

తెలుగు శిల్పి నైపుణ్యము తిలకించిన 'కవిశేఖర'! ॥స్వా॥

పండితులను, పామరులును పలువిధముల నుతియించిన,

నీ కావ్యము సుస్థిరమై నిలుచునులే 'కవిపుంగవ'! ॥స్వా॥

స్వాగతమో! కవికోకిల! స్వాగతమోయీ!

'నవయుగ కవి చక్రవర్తి' స్వాగతమోయీ!

**(18-12-1966) (శ్రీశైలంలో)**

## బాలలపండుగ

ప॥ చాచా నెహ్రూ పుట్టిన రోజిది,
చల్లని పిల్లల పండుగ రోజిది,
బాలకులారా! ఆడండి!
బాలికలారా! పాడండి! ॥చాచా॥

1. ధర్మమూర్తి మన తల్లి భారతికి
కలలు ఫలించిన కమ్మని రోజిది,
చీకటి తెరలను చీల్చి, లోకమున
దివ్యజ్యోతి వెలుగొందిన రోజిది.

2. ఎంతో చక్కని ఎర్రగులాబి
పువ్వులు పూచి, నవ్విన రోజిది,
భావిపౌరులౌ బాలబాలికలు
ఆనందముతో ఆడే రోజిది.

3. స్వాతంత్ర్యముకై ప్రాణాలొడ్డిన
త్యాగమూర్తులను తలచే రోజిది,
దేశసేవకై దీక్షను బూని,
దేశభక్తులను కొలిచే రోజిది.

4. నీతిమార్గమున నిలచి యుందుమని,
అన్యాయమ్మును అడ్డుకొందుమని,
పరులను తమ వలె భావించెదమని
ప్రతినలు గైకొను పండుగ రోజిది. **(నవంబరు 14, 1964) (శ్రీశైలంలో**),

## ఐక్యరాజ్యసమితి 22వ వార్షికోత్సవ సందర్భమున

సీ॥ యుద్ధభీతి నడంచి, యుర్వీజనాళికి
శాంతి ప్రసాదించు శాంతమూర్తి,.
మహిలోన వెలసిన మానవులందరు
సములని చాటెడు సాధుచరిత!
భండనప్రియులను బాగొప్ప దండించి,
ఖండించి వైచెడు కాళిమాత!
దళిత మానవులను దరిజేర్చి, ఓదార్చి,
అభయమొసంగెడు ఆదిశక్తి!

గీ॥ సకల భీకర మారణాస్త్రముల నుండి
కాచి, జనులను రక్షించు కల్పవల్లి!
ఆకసంబున రవి, చంద్రులుండుదాక,
రహి వహించెడు నిలవైకరాజ్యసమితి.

(24-10-1967) (శ్రీశైలంలో)

## ‘దాదాఫాల్కే అవార్డు’ గ్రహీత, ‘పద్మవిభూషణ్’ ప్రముఖ చలనచిత్ర నిర్మాత శ్రీ బి.యన్. రెడ్డి గారికి సన్మాన సభలో

1. శుభమస్త్వవిఘ్నమస్తు, చిరాయురస్తు, విజయోస్తు,
అస్తు బహురూపచిత్ర రచనాదుద్యన్మహా యశస్సిద్ధిః ॥
2. సీ॥ చిత్రనిర్మాణమ్ము జేపట్టి, భారత
స్త్రీని ‘దేవత’గ చిత్రించినారు,
‘బంగారుపాప’కు పసిడి పల్కులు నేర్పి,
కటికగుండెకు మమతఁ గఱపినారు,
‘మల్లీశ్వరి’ సృజించి, మనసున మల్లెల
మాలలూగించి సమ్మాన్యులైరి,
రమ్యమౌ ‘రంగులరాట్న’మింపుగఁ ద్రిప్పి,
బ్రతుకు గతులను జూపి, ప్రబలినారు.

గీ॥ దివ్య, సంసేవ్య శ్రీశైల తీర్థమందు
ప్రభవమంది ‘బంగారు పంజరంబు”
కొంగు బంగారమై మీకుఁ గూర్చుగాత,
శ్రీని, యశమును, నరసింహరెడ్డివర్య!

3. జగతిలో ధనమే సర్వార్థ సాధకమ్ము,
సర్వగుణములు ధనమునె యాశ్రయించు
నైన, ధనతృష్ణచే నాశయమ్ము విడక,
కళకు నంకితమైనట్టి ఘనులు మీరు.
4. మాపయి కూర్మిమీర బహుమానమొసంగిరి షీల్డు నొక్కటిన్,

మీపయి మాకు నేర్పడియె మిక్కుటమౌ యభిమాన గౌరవం
బేపుగ సాగుగాత! మన యీావరస్నేహ లతానుబంధమై
శ్రీపతి తోడు కాగ, బొమిరెడ్డి కులాంబుధి పూర్ణచంద్రమా!

5. ఒక్కొక శిల్పమున్ మలచి, యొక్కొక చిత్రముఁ గూర్చినారు, మీ
చక్కని చిత్రకావ్యములు సన్నుతి గాంచెను తెస్తునాట, నే
దిక్కున జూడ, మేల్, సిరియు, దీర్ఘ తరంబగు నాయునిచ్చి పెం
పెక్కు యశంబుగూర్చి మిమునేలునులే భ్రమరాంబదేవియున్.

**(1967 శ్రీశైలం)**

## శ్రీ 'నటరాజ రామకృష్ణ'కు స్వాగత గీతం

ప॥ స్వాగతమ్ము! 'భరతకళాప్రపూర్ణా! నటరాజా
వెమ్మనమున మేమొసంగు నీరాజనమందుకొనుమ!
1. భరతనాట్య భంగిమలో పరమాత్ముని దర్శించిన
పరమయోగివీవె కదా! భక్తమణీ! స్వాగతమ్ము!
2. నాట్య నీ ప్రాణమ్మె, నాట్యమె నీ గానమ్మె,
అమరనాట్య కళాసిద్ధికి అంకితమైనావు నీవు!
3. సాటిలేని నైపుణితో చక్కని యీా తెలుగుతోట
వెలయించితివెన్నో పూలు, విశ్వమంత పరిమళింప,
4. నాట్యకళారంగములో నవ్యత్వము సాధించిన
నాట్యాచార్యుడ వీవే! నటశేఖరుడవు నీవే!
5. నీ బోధన, నీ సాధన, నీవొనర్చు తపమంతా,
సార్థకమైతనరుగాత! శాశ్వతమై మనెడుగాత!

స్వాగతమ్ము!

**(3-1-1968) (శ్రీశైలంలో)**

# ‘కీలక’ ఉగాది (రూపకం)

**వ్యాఖ్యానం** : కాలచక్రం అనుక్షణం ముందుకు దొర్లి పోతోంది. దాని గమనాన్ని మనం గమనించినా, లేకున్నా, దాని ధర్మాన్ని అది నిర్వర్తిస్తూనే వుంటుంది. అది దాని నైజం.

• చక్రంలోని ఆకులవలె, మన కళ్ళముందు ఎన్నో ఉగాదులు గతించాయి. మరెన్నో ఉగాదులు రానున్నాయి.

• వచ్చేటప్పుడు అందాన్ని, ఆనందాన్ని వెంటబెట్టుకొని వస్తుంది ఉగాది. ఎండి మోడయిన తరులను చిగురింప జేసి, వాటికి వినూత్న శోభను గూర్చి, నవజీవనం ప్రసాదించినట్లే, బ్రతుకంటే రోసి, యీసురో మంటూ యెలాగో జీవితశకటాన్ని, యీడ్వలేక, యీడ్చుకొస్తూన్న సగటు మనిషి మనసులో క్రొత్త ఆశలు, క్రొత్త భావనలు రేకెత్తించి, అతనికి మళ్ళీ బ్రతుకుపై ఆశను కల్పిస్తుంది ఉగాది.

• కాని ఆ ఆశలను నెరవేర్చకుండానే వెళ్ళిపోతుంది ఉగాది. జీవితంలో నిరాశ, నిస్పృహలే మిగులుతాయి మనిషికి,

• అయినా, ఉగాది వచ్చిందంటే, ప్రాణం వస్తుంది మనిషికి. తృటికాలం నిరాశ, నిస్పృహలు అతని మనస్సులోంచి మాయమౌతాయి. ఏదో అనూహ్యమైన ఆనందం అతనిలో తొంగిచూస్తుంది.

• ఎన్నో దైనందిన సమస్యలతో సతమతమవుతూవున్న మానవుని జీవితానికి

మధువసంతం సమకూర్చుతుంది ఉగాది.

• అదిగో! మళ్ళీ వచ్చింది ఉగాది. గతించిన ప్లవంగ కు వీడ్కోలిచ్చి, క్రొత్త వత్సరం ‘కీలక’కు హృదయ పూర్వకంగా స్వాగతం పలుకుదాం!

పీడిత ప్రపంచ ప్రజానీకానికి, శాంతి, సౌఖ్యాలు ప్రసాదించమని వేడుకుందాం.

## గేయం

ప॥ స్వాగతమ్ము! 'కీలక' సంవత్సరమా! స్వాగతమ్ము!
ప్రజలెల్లరు సుఖియించగ, ప్రవచించుమ కీలకమ్ము! ॥స్వా॥
1. క్రొత్త పెళ్ళికూతురువలె, కులుకులొలకబోయుచు, నదె
తిరిగివచ్చెనామని - సందేశమిచ్చెనేమని? ॥స్వా॥
2. గున్నమావి లేచివుళ్ళు - కుతుకముతో మెక్కి, సొక్కి
కోయిలమ్మ కూయసాగె, క్రొత్తక్రొత్త పాటలెన్నో! ॥స్వా॥
3. ఎలమావిని పెనవైచెను, చెలిమాధవి ప్రియమొప్పగ,
ఆ రెండిటి సంబంధం-ఆదర్శపుటనుబంధం ॥స్వా॥
4. గతియించిన యా 'ప్లవంగ' గతినే నీవు సాగెదవో?
శాంతినొసగి జగతికి-నవచైతన్యము గూర్చెదవో? ॥స్వా॥
5. బ్రతుకే ఒక శాపమ్మై, బ్రతుకే ఒక పాపమ్మై,
బ్రతుకుతీపి చవిచూడని - పతితుల చల్లగ జూడుమ! ॥స్వా॥

వ్యాఖ్య : ఋతురాజు వసంతుడు.

- ఆతడనన్య సౌందర్యమూర్తి.
- సర్వాలంకార శోభితయై, దివ్యాంగనవలె కన్పట్టుచున్న ప్రకృతి కన్య, అభిసారికయై ఆనందపారవశ్యంతో, వసంతుని రాకయై ఎదురు చూస్తోంది.
- మల్లియ -మాలిక: మాలతి-మందార; పొన్న-పొగడ; అది-యిది యననేల? పుష్పసామ్రాజ్యమంతా చిరునవ్వులతో వసంతునికి హృదయపూర్వకంగా స్వాగతమిస్తోంది.

• లేత, లేత యిగుళ్ళను మెక్కి, కోయిలలు వీనుల విందుగా వసంతగీతిక నాలాపిస్తున్నై.

• మధుపిపాసాసక్తులైన మధుపములు వీరికన్నియల అధరసుధారసము గ్రోలి, మత్తెక్కి, మైమరచి, ఝుమ్మని సంగీతం పాడుతున్నై. వసంతుడేమో తెచ్చి యిస్తాడని, జగమంతా అతని రాక కొరకు, ఆశతో యెదురు చూస్తోంది.

• అదిగో! ఆలకించండి! ఆ స్వాగత గీతం!

ప॥ రావోయి! రావోయి! ఓ నవవసంతా!
నీ రాకకై లోకమెదురుచూచేను. ॥రావోయి॥
1. మల్లియలు నవ్వేను మాలికలు నవ్వేను,
మాలతీ-మందార మనసార నవ్వేను,
పొన్నలూ నవ్వేను - పొగడలూ నవ్వేను,
పూల కన్నియలన్ని - పొలుపుగా నవ్వేను. ॥రా॥
2. విరిసి, విరియక మున్నె - విరితేనియల గ్రోలి,
మత్తెక్కి యాడేను, మైమరచి తుమ్మెదలు,
నవజీవనానంద నాందిగీతమునేడు,
పంచమస్వరములో పాడేను కోయిలలు. ॥స్వా॥
3. ఏమొ తెచ్చెదవనుచు - ఏమొ యిచ్చెదవనుచు,
క్రుంగిపోయిన జగము - పొంగిపోయెను నేడు,
ఋతురా అందాల రతిరాజ రావోయి!
ప్రియమొప్ప కురిపించు ప్రేమామృతాలు. ॥రా॥

* * *

**వ్యాఖ్య** : సావధానంగా పరిశీలిస్తే మనకు స్ఫురించే సత్యం ఒక్కటే!

• కాలగతిలో వచ్చే ఉగాదులు కేవలం తాత్కాలిక సౌందర్యాన్ని, భౌతిక పరివర్తనను మాత్రమే తీసుకొని వస్తాయి.

• కాని, సామాజిక పరివర్తన, సాంఘికాభ్యుదయం సాధించాలంటే, ప్రజలలో మానసిక పరివర్తన రావాలి. మానవుని ఆలోచనా పద్ధతులే మారాలి.

• స్వార్థాన్ని పరిమితం జేసుకొని, మనిషి పరోపకార బుద్ధిని అలవరచుకోవాలి.

ఈసు-నసూయలను విడనాడి, ప్రేమానురాగాలతో మనస్సును
నింపుకోవాలి.

• సమానత్వం - సౌభ్రాతృత్వం - స్వేచ్ఛల ప్రాతిపదికపై నవప్రపంచాన్ని
నిర్మించాలి ఆనాడే, మానవ జీవితానికి నిజమైన ఉగాది.

• అప్పుడే లోకానికి నవవసంతం!

గేయం

1. మనుషులు మారాలి - మనసులు మారాలి.
మనుషుల మనసుల్లో మమతలు చేరాలి.
మల్లెపందిరి వంటి - చల్లని మనసుల్లో,
చక్కని భావనలు - పెక్కులు రావాలి.
ఆనాడే లోకానికి అసలు ఉగాది!
అపుడె ప్రజానీకానికి అసలు వసంతం.

2. కొందరి లాభాలు అందరికి అందాలి!
పరులను తమవలె భావించి చూడాలి!
విశ్వశాంతికి బ్రతుకులంకితము కావాలి!
మానవుడే దేవుడై - మహిని వర్ధిల్లాలి.
ఆనాడే లోకానికి అసలు ఉగాది!
అపుడె ప్రజానీకానికి అసలు వసంతం.

29-3-1968 (శ్రీశైలంలో)

## స్వాతంత్ర్య గీతి

స్వాతంత్ర్యం వచ్చిందండీ!
స్వారాజ్యం వచ్చిందండీ!
ఏమేమి తెచ్చిందండీ!
ఎవరెవరికి యిచ్చిందండీ.

1. తెల్లోళ్ళను బయటకు నెట్టి
నల్లోళ్లే పాలకులైరి,
త్యాగాలకు మంగళమనిరి,
భోగాలకు బానిసలైరి.

2. ఇరువది సంవత్సరములలో
ప్రణాళికలు రూపొందించీ,
ప్రాజెక్టులు కట్టారెన్నో,
ప్రగతిని సాధించారెంతో

3. అధికారుల అంకెలగారడి
అభ్యుదయం సూచిస్తుంటే,
తీయనైన మాటలలోన
తేనెసోనలూరుతువుంటే,

4. నిరుపేదల బ్రతుకులు బరువై
నిట్టూర్పులె మిగిలాయండి,
సిరి, సంపద, భోగాలన్నీ,
శ్రీమంతులఁ జేరాయండి. ॥స్వాతంత్ర్యం॥

5. మారుతోంది కాలమనిరి,
మారుతోంది దేశమనిరి,
మారలేదు లేశమైనా
సామాన్యుని చితికిన బతుకు. ॥స్వాతంత్ర్యం॥
6. స్వారాజ్యం తెచ్చిన ఫలము
స్వాతంత్ర్యం యిచ్చిన కలిమి,
కొందరిదే కాదనుకుంటే,
అందరికీ చెందాలంటే, ॥స్వాతంత్ర్యం॥
7. స్వపరభేద భావము వీడి,
స్వార్థానికి హద్దులు పెట్టి,
మనసుల్లో మమతలు నింపి,
మానవులై మనగలగాలి.
8. కష్టించే ప్రతియొక్కరికి
కడుపునిండ కూడువుండి,
సాధించిన భాగ్యమంతా
సామాన్యుని చేరిననాడు,
9. స్వాతంత్ర్యం తెచ్చిన ఫలము
సార్థకమై తీరునులెండి!
దివియనునది వేరొకటుంటే,
భువిపైనది నిలుచును లెండి! ॥స్వాతంత్ర్యం॥

**(15-8-1967) (శ్రీశైలంలో)**

## ప్రబోధగేయం

1. స్వాతంత్ర్యం వచ్చిందంటూ,

స్వారాజ్యం వచ్చిందంటూ,

చంకలెగురవేసుకుంటూ,

సంబరపడిపోతారే!

తిలకించండయ్యలారా!

దేశమెలా వున్నదో!

పరికించండమ్మలారా!

బ్రతుకులెలా వున్నవో! ॥స్వాతంత్ర్యం॥

2. పంచవర్ష ప్రణాళికలు - పంచాయతి రాజ్యమంటు

గద్దెలెక్కి చెబుతారే, పెద్దపెద్ద మాటలెన్నో,

వెచ్చించిన శ్రమ, సంపద, వెలలుగట్టి చూశారా!

సాధించిన ఫలమెంతో సరిగ లెక్కవేశారా! ॥స్వా॥

3. 'సోషలిజం' ధ్యేయమంటు - ఘోషబెట్టి అరిచారే!

ఏదండీ సోషలిజం? ఎక్కడండి సోషలిజం?

కూటికొరకు కొంతమంది కుందుచుండ, మరికొందరు,

కోటికి పడగెత్తి, నిలచి, కులుకుటయా సోషలిజం? ॥స్వాతంత్ర్యం॥

4. అప్పుజేసి పప్పుకూడు ఆరగింపు మానాలి,

కష్టమోర్చి పనిజేయుట, గౌరవమని తలచాలి,

మనకు వలయు తిండినంత మనమే పండించాలి,

కరువు తొలగి దేశంలో సిరులు తాండవించాలి. ॥స్వా॥

5. స్వాతంత్ర్యం సుస్థిరమై సార్ధకమవ్వాలంటే,
సాధించిన ఫలమంతా సామాన్యునికందాలి,
'స్వార్ధమె పరమార్ధమ్మ'ను పాడుతలపు మానాలి.
దేశసేవకంకితమై దీక్షమరల పూనాలి. ॥స్వా॥
6. తెల్లవాళ్ళ మరఫిరంగి గుళ్ళకెదిరి నిల్చినట్టి
మహనీయుల త్యాగాలను మదిదలంచి ప్రతియొక్కరు,
గాంధీ, నెహ్రూ చూపిన ఘనపథాన పయనిస్తే,
ప్రగతిపథంలో దేశం పయనించును ఆనాడే. ॥స్వా॥

**(15-8-1968) (శ్రీశైలంలో)**

# ప్రార్థన

ప॥ ప్రభూ! హే ప్రభూ! మారనీ! దేశం మారనీ!
మారనీ! నా దేశం మారనీ!
చేరనీ! క్రాంతిపథం చేరనీ! ॥ మారనీ ॥

1. గతవైభవమొక్కసారి కళ్ళుతెరచి చూడనీ!
ఉప్పొంగే హృదయంతో ఒళ్ళుమరచి పాడనీ!
పరపాలన నెలకొల్పిన భావదాస్యముడుగనీ!
నవస్వతంత్రభావాలతో, నవపథాన నడవనీ! ॥ మారనీ ॥

2. నరనరాల జీర్ణించిన 'నా' యన్నది తొలగనీ!
నరులందరు ఒకటేయను నవభావం కలగనీ!
బలవంతుడు, బలహీనులు బాధించుట ఆగనీ!
మనిషి, మనిషి చేయికలిపి, మంచిదారి సాగనీ! ॥ మారనీ ॥

3. దేశాభ్యున్నతికి ప్రజలు దీక్షబట్టి లేవనీ!
పొలిమేరల రక్షణకై ముందుకురికిపోవనీ!
పుడమితల్లి పులకలెత్తి పొలుపారగ పండనీ!
కరువు తొలగి, దేశంలో సిరి, సంపద నిండనీ! ॥ మారనీ ॥

4. భారతమంతా ఒకటను పరమార్థం తెలియనీ,
భాషా, మత, సామరస్య బంధముతో కలియనీ!
ఉత్తరమూ, దక్షిణమను ఉలికిపాటు వదలనీ, ॥ మారనీ ॥
ఒకేమాటపై నిలచి, ఒకే బాట కదలనీ!
మారనీ! నా దేశం మారనీ!
చేరనీ - క్రాంతిపథం చేరనీ!

**(1966)** (శ్రీశైలంలో)

## రంగి శ్రీశైలం

ప॥ రంగీ! నా బంగారి రంగీ!

పోదాము రాయే శ్రీశైలమూ!

1. సేదుకో మల్లయ్య! సేదుకో అందము,

అలుపు సొలుపూలేక ఆడుతూ పోదాము! ॥రంగీ॥

2. సేయీ-సేయీ కలిపి, సికరము కొండెక్కి,

శ్రీశైల గోపురము సిత్రంగ సూద్దాము! ॥రంగీ॥

3. ఆటకేశుడి గుళ్ళో - ఆరతి యెలిగిద్దాము,

సొచ్చి గణపతి ముందు సాగిలాపడదాము! ॥రంగీ॥

4. మనసులో మాటేదో, మల్లయ్యకు సెబుదాము,

జలమ-జలమాలకీ జంటగా వుందాము! ॥రంగీ॥

5. బెమరమ్మ తల్లికీ యెయ్యి దణ్ణాలెట్టి,

బుల్లోడినియ్యమని పూజలే సేద్దాము... ॥రంగీ॥

6. కొత్త దంపతులల్లె - కొంగులు ముడియేసి,

పాతాళగంగలో తానాలు సేద్దాము! ॥రంగీ॥

7. సివరాతిరి తిరణాల్లో సీరలు కొనిపెడతా

రంగూ-రంగుల గాజులు రంగీ! నీకేయిత్తా! ॥రంగీ॥

**(30-3-1967)**

## అందాలా చిలకల్లారా!

## (విద్యార్ధుల నుద్దేశించి)

ప॥ అందాలా చిలకల్లారా!
అనురాగపు మొలకల్లారా!
అరవిరసిన పువ్వుల్లారా!
పరమాత్మ స్వరూపుల్లారా!

1. భావిభరతపౌరులు మీరే!
భాగ్యోదయ భానులు మీరే!
భారతాంబ హృదిలో వెలిగే
మహదాశాజ్యోతులు మీరే! ॥అందాల॥

2. బడియే ఒక గుడియని తెలిసీ,
గురువే దైవమ్మని తలచీ,
చదువులలో సారము నెరిగీ,
సాగండీ ప్రగతి పథాన! ॥అందాల॥

3. కన్నవారి కన్నుల వెలుగై
వెన్నెలలే కాయించండీ!
జన్మభూమి స్వర్గముకన్న
మిన్నయనీ భావించండీ! ॥అందాల॥

4. పెడదారులు పట్టించేటి
చెడుమాటలు వినబోకండి!
చదువులకు స్వస్తిని చెప్పి

సమ్మెలకు దిగబోకండి! ॥అందాల॥

5. క్రమశిక్షణ మీకలవడితే

గాంధీలా ఘనులౌతారు,

నీమముతో నీతిగ వుంటే

నెహ్రూలా నిలబడతారు. ॥అందాల॥

6. సమతాభావమ్మును కలిగీ,

మమతలతో మనసులు నింపీ,

అనురాగపు సుధలను గ్రోలీ,

ఆనందమునే పొందండీ!

అందాల చిలకల్లారా!

అనురాగపు మొలకల్లారా!

అరవిరిసిన పువ్వుల్లారా!

పరమాత్మ స్వరూపుల్లారా!

(శ్రీశైలంలో)

# వందనమో ప్రియభారతి

ప॥ వందనమో ప్రియభారతి! వందనమమ్మా!
వందనమో జయభారతి! వందనమమ్మా!
వందనమో జనయిత్రీ వందనమమ్మా!
సుందర సురుచిర గాత్రీ వందనమమ్మా! ॥వంద॥

1. శీతనగము నీ శిరమున చెలగె శిరోభూషణమై,
భాగీరథి నీ గళమున భాసిల్లెను కంఠెయై,
వింధ్యాద్రియె కటిసీమను విలసిల్లెను మేఖలయై
పావన కన్యాకుమారి పాగడయై శోభిల్లెను!

2. కమ్మని కైతల నల్లిన కాళిదాస సుకవీంద్రుడు,
భండనమున రిపువీరుల ఖండించిన వీరఝూన్సి,
సత్యాహింసల మహిమను జగతికి చాటిన బాపూ,
నీ చల్లని యొడి లోపల నిదురించిన పసిపాపలె!

3. నీవొక అందాలవనివి! నీవొక రత్నాలగనివి!
విశ్వశాంతి సాధనకై వెలసిన దేవతవు నీవు!
నీ నామము గానముగా నిరతము భజియింతుమమ్మ!
నీ రూపము మా మదిలో నిల్పి సతము కొలుతుమమ్మ! ॥వంద॥

4. మతములు వేరైనా మాయందరిదొకటే బాట,
బాసలువేరైనా మాయందరిదొకటే మాట,
పొలిమేరల పొంచియున్న ముష్కరులను తెగటార్చగ,
శక్తియుక్తులొసగుమమ్మ! జయమును చేకూర్చుమమ్మ! **(26-1-1967)**

## ఆత్మార్పణము

దేవా! దేవా!

ప॥ స్వీకరింపుము దేవ! ఈ చిన్ని కుసుమమ్ము
ఆలసించితివేని రాలిపోవును సుమ్మి! ॥స్వీ॥

1. అందమే లేదనుచు నిందమోపెదవేమొ!
గంధమే లేదనచు కదలిపోయెదవేమొ!
2. నీచజాతిది యనుచు నిరసించకో దేవ!
నీపైని జీవమ్ము నిలిపియుంటిని రావ! ॥స్వీ॥
3. నీ పాదసేవలో నెలవొసంగుము, దేవ!
ఈ పేద పూబాలనెడసేయకో దేవ! ॥స్వీ॥
4. స్వీకరింపుము దేవ! ఈ చిన్ని కుసుమమ్ము
మాలఁజేర్చుము దీని నేలరాలక మున్నె!

**(1963)**

## వాసంతగీతి

అదిగో వచ్చెను వాసంతి,
ఇదిగో విచ్చెను పూబంతి,
తీయగ కోయిల పాడినది,
హాయిగ కేకియె ఆడినది,
పున్నమి వెన్నెల పూచినది, వే
గన్నుల చిన్నెల నించినది.
అందమె జగమున పండినది, సౌ
గంధమె జగమున నిండినది.
కమ్మనితేనియ గ్రోలుటకే, ఝుం
ఝుమ్మని తుమ్మెద వ్రాలినది.
నవజీవనమే భువి నిండె,
నవభావనలే మదినించె.

**(1963)**

## జవహర్‌లాల్‌నెహ్రూ నిర్యాణము

లేడా! లేడా!

చాచా నెహ్రూ లేడా! ఇక

బాలల జవహరు రాడా! ॥లేడా! ॥

1. జ్యోతి ఒక్కటి ఆరింది,

గులాబి యొక్కటి రాలింది,

భారతమాత హృదయంలో

తీరని వేదన మిగిలింది.

2. సత్యాహింసలు జగతికి నేర్పి,

మనిషి గుండెలో మమతలు రేపి,

దీనావనుడై, దివ్యచరితుడై

విశ్వశాంతికై వెలసిన దేవుడు.

3. భారత భాగ్యవిధాతయని,

ప్రపంచ శాంతి ప్రదాతయని,

నిండుమనసుతో నిను తలచెదము.

మార్గదర్శివై మము నడిపించుము.

బాలల నెహ్రూ లేడా! యిక బాలల జవహరు లేడా!

లేడా! లేడా!

చాచా నెహ్రూ లేడా! ఇక

బాలల జవహరు రాడా! ॥లేడా! ॥

**(1964) (శ్రీశైలంలో)**

## భరతమాత (సంగీతరూపకం)

ప॥ ఇది భారతం, ఇదీ భారతం,
మన భారతం – మహాభారతం ॥ఇది॥

1. గోదావరి, కృష్ణ పాదార్చనముచేయ
అన్నపూర్ణగ వెలయు ఆంధ్రజనయిత్రిదిగో!
కన్నబిడ్డలనెల్ల మిన్నగాఁ జదివించి,
మహిత యశమును గన్న మళయాళ మగువిదిగో. ॥ఇది॥

2. సంఘ సంస్కర్తలకు, సాహితీవేత్తలకు,
జన్మనిచ్చిన వంగజనని అల్లదిగో!
గీతగోవింద సంగీత మాధుర్యమున
నుర్వి లించిన ఉత్కళాంగన యిదిగో. ॥ఇది॥

3. రాణాప్రతాపాది రసపుత్రవీరులను
లాలించి, పెంచిన రాచపుత్రిక యిదిగో,
దేశ సంరక్షణకు ధీరపుత్రులగన్న
పంచనద యభిషిక్త బంగారుతల్లదిగో. ॥ఇది॥

4. మధుర కన్నడరాగ మంజుల స్వనముతో,
కలహంస నడలతో కలికి ఏతెంచెనదె.
సంగీతభారతిని చలువపందిట నిల్పి,
అమితభక్తిని కొల్చు తమిళసోదరి యిదే. ॥ఇది॥

5. అందాల కాశ్మీరు సుందరీమణి యిదే,
అస్సాము హిమగిరుల అలరారు రమణియదె,
ఛత్రాధిపతిగన్న జనయిత్రి అల్లదే!
మన మహాత్మునిగన్న మాతృదేవత యిదే!
ఇది భారతం - ఇదీ భారతం,

మన భారతం - మహాభారతం.

## తెలుగుతల్లి

ప॥ ఒక్కటే తెలుగుదేశం, మన
దొక్కటే వెలుగుదేశం. ॥ఒక్కటే॥

1. గోదావరీ, కృష్ణ గొంతెత్తి పాడేను,
తుంగభద్రా, పెన్న తూగుచూ ఆడేను,
మంజీర, కిన్నెరులు మంగళారతులొసగె
భాగ్యనగరంబె మన భాగ్యమై ఎసగేను. ॥ఒక్కటే॥

2. 'అన్నపూర్ణ'యె గదర! ఆంధ్రమాగాణమ్ము!
రతనాల విపణిరా! కృష్ణ రాయలసీమ,
ఖనిజాల గనిర! మన వరతెలంగాణమ్ము!
తెలుగుదేశ యశమ్ము యెలుగెత్తి చాటేను. ॥ఒక్కటే॥

3. రాణ్మహేంద్రములోన రాజిల్లె భారతము,
'ఏకశిల' నగరిలో యెసగె భాగవతమ్ము.
విజయనగరములోన విలసిల్లె శిల్పమ్ము,
తెన్గుధీధితులు నల్దెసల ప్రసరించేను. ॥ఒక్కటే॥

4. ముక్కలై మనజాతి యిక్కట్ల నొందినది.
ఒక్కటై తల్లియొడి చక్కగాఁ జేరినది,
అయిదుకోట్లాంధ్రులము, అన్నదమ్ములమురా!
పొరపొచ్చెములు లేక పొందుగా వుందాము! ॥ఒక్కటే॥

5. కష్టమైనను గాని, నష్టమైనను గాని,
కలతలేమియు లేక, కలిసిమెలిసుందాము,
ఇరుప్రక్కలగ దేశమెప్పుడును గానీక,
ఇరుగు-పొరుగులు మెచ్చ, నేకమై వుందాము.
ఒక్కటే తెలుగుదేశం! మన
దొక్కటే వెలుగు దేశం.

(1970)

## రంగి విలాసం

1. పొద్దుపొడవక ముందే, బొట్టు-కాటుక పెట్టి,
కొప్పులో పూలెట్టి - కుండా సంకనబెట్టి,
నీలాటిరేవుకు నీటుగా పోతుంటె,
అప్పుడే సూడాలి నారంగి సోకూ,
అప్పుడే సూడాలి నారంగి సొగసూ. ॥పొద్దు॥
2. మద్దెసేలో పెద్ద మంచెపై నిలుసోని,
హేహెయ్! హెయ్! అంటూ, యెలుగెత్తి కేకేసి,
వడివడిగా తిప్పి, వడిసెల యిసిరేస్తుంటే,
అప్పుడే సూడాలి నారంగి ఒంపూ,
అప్పుడే సూడాలి నారంగి పొంపూ.
3. పచ్చని సీరలో లచ్చిమీదేవల్లె,
పొందుయెన్నెల్లోన నిండుగ కూసుంటే,

దేవతే పైనించి దిగినట్టులుంటాది.
అప్పుడే సూడాలి నారంగి అందం,
అప్పుడే సూడాలి నారంగి సందం. ॥పొద్దు॥
4. తొలకరించిన వయసు ఉలికులికి పడుతుంటే,
సంకురాతిరినాడు సక్కంగ ముస్తాబై,
కొంటెసూపులు యిసిరి, కులుకుతా పోతుంటే,
అప్పుడే సూడాలి నారంగి తళుకు,
అప్పుడే సూడాలి నారంగి బెళుకు.
5. ఏటిగాలులు పైకి యిసిరిసిరి కొడుతుంటే,
పైటరెపరెపలాడి, ఆటలాడుతు వుంటె,
సెదిరిన ముంగురులు సిందులేత్తుంటేను,
అప్పుడే సూడాలి నారంగి నీటు,
అప్పుడే సూడాలి నారంగి గోటూ. ॥పొద్దు॥

## ఓ మహాత్మా! ఓ మహర్షీ!

జోహారు! జోహారు! ఓ మహాత్మా!
జోహారు! జోహారు! ఓ మహర్షీ! ॥జోహారు॥

1. సత్యమే దైవమను సత్యమ్ము పలికితివి,
నిత్యమాదైవమునె నీమమునఁ గొలిచితివి,
సత్యాగ్రహాయుధముఁ జక్కగా ధరియించి,
పారతంత్ర్యపిశాచిఁ బారద్రోలితివయ్య! ॥జోహారు॥

2. మనసులో, మాటలో, నొనరించు చేతలో,
త్రికరణంబుల నొక్కరీతి మెలగితివయ్య!
శాంతి ప్రవచనములఁ జగతికుపదేశించి,
పురుషోత్తముడవగుచు, భువిని వెలసితివయ్య! ॥జోహారు॥

3. 'వందేమాతర'మనుచు, వచియించినావయ్య!
'క్విట్టిండియా' యనుచు కేకెట్టినావయ్య!
తెల్లదొరలెల్లరును తల్లడిలిపోయారు,
భరతదేశమువీడి పరుగెత్తిపోయారు.

4. నీ చూపులో మాయ ఏమున్నదో? ఏమొ?
నీ మాటలో మంత్రమేమున్నదో ఏమొ?
నీ పిలుపునందుకొని నిఖిల భారత ప్రజలు
నీవెన్క నడిచారు - నీవెంట నిలిచారు. ॥జోహారు॥

జోహారు! జోహారు, ఓ మహాత్మా!
జోహారు, జోహారు, ఓ మహర్షీ!

# ధన్యజీవివయ్యా! బాపూ!

ధన్యజీవివయ్యా! బాపూ!
పుణ్యజీవివయ్యా! ॥ధన్య॥

1. మతముల పేరిట మానక జరిగే
మారణహోమం మాన్పించాలని,
అనవరతము యత్నించావే!
అందుకె బలియైపోయావే? ॥ధన్య॥

2. మాటలకందని మంచితనానికి
మారురూపమై వెలిశావే!
దేశంకొరకే పుట్టావే!
దేశంకొరకే గిట్టావే! ॥ధన్య॥

3. ప్రేమేదైవము - దైవమె ప్రేమని
ప్రేమసుధలు చిలికించావే!
నీలోదేవుని చూపావే !
మాలో భీతిని బాపావే! ॥ధన్య॥

4. మకుటములేని మహారాజువుగా
మా హృత్సీమలనేలావే!
మా జోతలివే గైకొనవే!
మంచిని మాలోనించగదే! ॥ధన్య॥

ధన్యజీవి వయ్యా! బాపూ!
పుణ్యజీవి వయ్యా!

# ఎటులుండేదో? దేశమెటులుండేదో?

ఎటులుండేదో? దేశమెటులుండేదో?
బాపూ! నువ్ బ్రతికుంటే ఎటులుండేదో?
1. సత్యాహింసలు భువిపై చావక నిలిచేవేమో?
సామాన్యుని జీవనంబు - చక్కగ సాగేదేమో?
ప్రజాస్వామ్య సౌధమిలా - పగులక యుండేదేమో?
ప్రగతిపథంలో దేశం - పయనించుచు పోవునేమో.
2. సత్యాగ్రహశక్తి విలువ - జారక నిలిచేదేమో?
స్వాతంత్ర్యమె సఫలంబై - సార్థకమయ్యేదేమో?
నాగరికత వక్రగతుల - సాగకయుండేదేమో?
నవ్యభారతావనిలో నాకమై వెలసేదేమో?
3. నీయనుచరులీ విధాన - నీతిని విడకుందురేమొ?
త్యాగాలకు మంగళమని భోగాలను మరుగరేమొ?
పదవీ వ్యామోహంలో పరమార్థం విడరేమో?
పదిలంబుగ నీ బోధలు మదిని నిలిపి నడతురేమొ?
ఎటులుండేదో? దేశమెటులుండేదో?
బాపూ! నువ్ బ్రతికుంటే ఎటులుండేదో?

## మనసే నిర్మల మందిరమైతే!

1. దేవుడెక్కడో వున్నాడంటూ,
దేవులాడెదవు దేనికిరా?
మంచిమనసుగల మానవమాత్రుడె
మహిని దేవుడని తెలియుమురా! ॥దేవు॥

2. సత్యమార్గము సతము చరించిన
గాంధీ దేవుడు కాదటరా?
శాంతము, ప్రేమా, సహనము జూపిన
బాపూ రాముడు కాదటరా? ॥దేవ॥

3. పరుల మేలుకై పాటుపడిన, మన
గాంధీజీయే దేవుడురా!
పరదుఃఖములో పాలుగొనిన, మన
బాపూజీయే రాముడురా! ॥దేవ॥

4. జీవహింస బహుచెడ్డ పాపమని
చెప్పిన బాపూ దేవుడురా!
సర్వభూతముల సమభావముతో,
జూచిన గాంధీ రాముడురా! ॥దేవ॥

5. అందరు మనుజులు అన్నదమ్ములని
యనిన మహాత్ముడె రాముడురా!
ఆత్మశక్తితో యరుల జయించిన
అమరమూర్తియే దేవుడురా! ॥దేవ॥

6. మనసే నిర్మల మందిమైతే
వేరే ఆలయమెందుకురా?
బాపూ సూక్తులె పాటించినచో
వేరే పూజలు ఎందుకురా?

దేవుడెక్కడో వున్నాడంటూ,
దేవులాడెదవు దేనికిరా?
మంచిమనసుగల మానవమాత్రుడె
మహిని దేవుడని తెలియుమురా !

## ఏ కులమువాడైననేమీ?

ఏ కులము వాడైననేమీ? మన గాంధి
ఏ మతము వాడైననేమీ? ॥ఏ॥

1. కుల, మతంబులకన్న గుణమె ఘనమన్నాడు,
ధర నహింసయె పరమధర్మమని యన్నాడు.
సర్వమానవ సమత సమ్మతంబన్నాడు..
పరమతద్వేషమ్ము పాపమని యన్నాడు. ॥ఏ॥

2. అంటరానితనంబు అంటువ్యాధన్నాడు.
హరిజనోద్ధరణ తన ఆశయంబన్నాడు,
ఈశ్వరుండల్లాయు నిర్వురొకటన్నాడు.
సర్వమత సామరస్యంబె వలెనన్నాడు.. ॥ఏ॥

3. గుణహీనమైనట్టి కులమేలనన్నాడు,
మంచినేర్పని దొసగు మతమేలనన్నాడు.
లోకమెల్లన యొక్క లోగిలేనన్నాడు.
ఉర్విజనులెల్లరు సహోదరులె యన్నాడు.

ఏ కులము వాడైననేమి? మన గాంధి
ఏ మతము వాడైననేమీ?

## ఉగాది (సంగీత రూపకం)

వచ్చిందదండీ! వచ్చింది,
ఉగాది పండుగ వచ్చింది.
తెచ్చిందదండీ తెచ్చింది.
జగానికందం తెచ్చింది, యీ
జగానికందం తెచ్చింది.

1. వగరు వగరుగా, పుల్లపుల్లగా.
తియ్యతియ్యగా, చేదుచేదుగా,
అన్ని రుచులనూ, ఆస్వాదించుచు,
తెలుగుబిడ్డ జేజేలు పలుకగా ॥వచ్చిం॥

2. చిలుకపచ్చని చీరను కట్టి,
కొప్పున పువ్వుల నొప్పుగ బెట్టి,
ప్రకృతికాంత నీరాజనమిడగా,
చైత్రరథము జయయాత్ర సాగగా. ॥వచ్చిం॥

3. తెలుగుతోట సుమతేనియలూరగ,
తెలుగుకోయిలలు తియ్యగ పాడగ,
తెలుగు బాలలుయ్యాల లూగగా,
తెలుగుబాటలే వెలుగులు నిండగ,
వచ్చిందదండీ! వచ్చింది
ఉగాది పండుగ వచ్చింది.
తెచ్చిందదండీ, తెచ్చింది,
జగానికందం తెచ్చింది.

(8-4-1978) (నరసరావుపేటలో)

# నవాబ్ది

1. సూర్యగోళం చుట్టి తిరిగెను,
భూమిగోళం మరో శ్రీ భ్రమణం,
కనులవిందుగ కన్నె ప్రకృతి
మార్చుకొన్నది మరోవసనం.

2. పాత యల్లదె పారిపోయెను,
క్రొత్త వత్సరమెత్తి వచ్చెను,
పాతరోతగా కనుపించును,
క్రొత్త వింత గోచరించును.

3. కాని, పాతయంతా రోతకాదు,
క్రొత్తయంతా వింతకాదు,
పాత - క్రొత్తల మేలుకలయిక,
ప్రాణికోటికి 'మేలుకల'యే.

4. గతంలోనికి తొంగిచూద్దాం!
మంచి -చెడు బేరీజు వేద్దాం!
లోకహితమును కోరుకొంటూ,
నవాబ్దమునకు నాంది చెబుదాం!

5. పెద్దలందరు గద్దెకోసం
గ్రుద్దులాడుచు, ప్రొద్దుపుచ్చగ,
దేశసేవకు తీరికేదీ?
సంఘసేవకు సమయమేదీ?

6. పితరులను పున్నామ నరకపు
నూతిలో పడకుండఁ గాచెడు
వారె, పుత్రులుగాఁ దలంచుచు
వారి హితమే దేశహితమని,

7. వారలను తమ వారసులుగా,
భావిభారత పాలకులుగా,
కలలుగాంచగ, నా సుపుత్రులె
తలకు మించిన భారమాయిరి!

8. దేశమేలే ప్రభువులకు, కా
వేశరోషములధికమాయెను,
వ్యక్తిగత విద్వేష జ్వాలలు
పాలకులలో ప్రజ్వరిల్లెను.

9. ఎవరి దారులు వారివై, మన
ప్రభుత 'జనత' చరించుచుండెను,
ఆశయే అడియాస కాగా,
పేద జనతకు వెన్ను విరిగెను.

10. ప్రకృతి విలయ ప్రభంజనంలో
పచ్చపచ్చని పంటపొలములు,
పంచబంగాళంబు కాగా,
పాలికాపుకు సౌఖ్యమెక్కడ?

11.దేవళంబున దీపమారిపి
నిలువుదోపిడి దోచుకున్నా.
ఆత్మరక్షణలేని దేవుడు
లోకరక్షణ చేయగలడే?

12.పూజ్యగురువుల బోధ సూక్తులు
పూజ్యమాయెను పుణ్యభూమిని,
కోతి -పిల్లల న్యాయమును విడి,
కోతులాయిరి కొంటెశిష్యులు.

13.ఎన్నియేండ్లు గతించినా, మరి
ఎన్ని పార్టీలేలుతున్నా,
ఏమి తలచుకు గర్వపడదాం?
ఏమి చూచుకు పొంగిపోదాం?

14.అయినా, గతము తలచుకు బాధపడుతూ
ఈసురోమని ఎందుకుండుట?
భావికాలపు భవ్యచరితను
ముచ్చటించుకు మురిసిపోదాం.

15.విడచిపోయే మిత్రునకు వలె,
గతమునకు వీడ్కోలు చెబుదాం.
అరుగుదెంచే అభినవాబ్దికి
ప్రేమతో స్వాగతము చెబుదాం.

16.స్వాగతమ్మిదె, అభినవాబ్దమ!
స్వాగతమ్మిదె గొనుము తల్లీ!
ఈ దురాగతములను బాపుచు,
ఏలుమమ్మా! ఈ ధరిత్రిని.

17.దేశమేలే నాయకులకు, సు
ధీవిశాలత నొసగుమమ్మా!
స్వార్థచింతన బాపి, వారికి
త్యాగనిరతిని గరపుమమ్మా!

18.రక్తబంధపు రాగలోలత
మత్తులో వెర్రెత్తిపోవుచు,
దేశహితమును విస్మరించెడు.
మేటినేతల మేలుకొలుపుమ!

19.నిలుపుమీ విద్యాలయాలను
నియమబద్ధ పునీతములుగా,
తీర్చిదిద్దుమ దేశయువతను
దేశసేవకు దీక్షబూనగ, దేశ

20.ఏమికతమో? ఈ ధరిత్రిని
ఆవరించెను అంధకారము,
తొలగజేయుమ!
వెలుగునీయుమ!
తొల్లి విభవము కలుగజేయుమ!

21.బుద్ధదేవుడు, పూజ్యబాపూ,
వీరఝూన్సీ, వేనవేలుగ,
మరల భారతభూమిపై,
యవ తారమెత్తుట యెప్పుడమ్మా?

22.మాదు మనసులు పెరగనిమ్మా!
మాదు స్వార్ధము తరగనిమ్మా!
మలినభావము తొలగనిమ్మా!
మంచియూహలు కలుగనిమ్మా!

23.ఈ విశాల ప్రపంచ బాలల
నవనవోదయ వత్సరంబిది,
భావిభారత సృష్టికర్తలు
బాలలను కాపాడుమమ్మా!

24.శ్రీలు పొంగే జీవగడ్డగ
చేయుమమ్మా యీ ధరిత్రిని,
దేశదేశములెల్ల మెచ్చగ
తీర్చిదిద్దుమ! మా చరిత్రను!

25.భావికాల మహోదయంలో
భారతము తిలకించనిమ్మా!
ఆ ఉషస్సు వెలుంగులో, మా
యుల్లములు పులకింపనిమ్మా!

26. కుల, మతాలను వలయములలో
కూరుకొనిపోకుండc జూడుమ!
మానవతయే మంచిమతమని
బాలకోటికి ప్రబోధించుమ!

27.సర్వప్రజలకు శాంతినిమ్మా!
సోదరులవలె మెలగనిమ్మా!
శాంతి యభ్యుదయంబు లొసగి
స్వతంత్రముగా బ్రతుకనిమ్మా!

**(1979) (నరసరావుపేట)**

## ఎందుకివ్వాలి వీడ్కోలు?

(1977 సంవత్సరంలో సంభవించిన తుఫాను, ఉప్పెనలకు దివిసీమ వాసుల జీవితం అతలా కుతలమైపోయింది. ఎందరో ప్రజలు మరణించారు. ఎంతో ఆస్తినష్టం జరిగింది. ఆ సంఘటన వల్ల దిగ్భ్రాంతి చెంది, ఆవేదనను వెలిబుచ్చుతూ కూర్చిన రచన యిది.

క్యాలెండరులో మరో కాయితం చిరిగింది.
కాలచక్రం మరో చుట్టు ముందుకు తిరిగింది.
డెబ్బై ఏడు పోబోతూంది
డెబ్బై ఎనిమిది రాబోతూంది.
విడిపోయే ఆప్తులకు సాదరంగా వీడ్కోలిచ్చి.
సాగనంపటం పరిపాటి.
కాని, గతాబ్దికి వీడ్కోలివ్వాలంటే, గొంతు పెగలటం లేదు.
చేయెత్తి నమస్కరించాలన్నా, మనస్కరించటం లేదు.
అంతరాంతరాళాల్లోంచి వినిస్తున్నాయ్ రెండే రెండు ప్రశ్నలు -
ఎందుకివ్వాలి వీడ్కోలు?
ఏమని చెప్పాలి వీడ్కోలు?

1. మింటికి, మంటికి ఏకధారగా ప్రళయవృష్టి
   సృష్టించి, ఏళ్ళు-కోళ్ళు ఏకం జేసిందనా?
   పచ్చని పంటపొలాన్ని నిప్పచ్చరంజేసి, ఏడాది
   పొడుగునా రైతన్నవద్ద కష్టాన్ని ఏటిపాలు చేసిందనా?

ఎందుకివ్వాలి వీడ్కోలు?

ఏమని చెప్పాలి వీడ్కోలు?

2. కడలిగర్భంలో కారుచిచ్చు రగిల్చి.

ఉత్తుంగ తరంగాలతో ఉప్పెనను సృష్టించి,

విలయతాండవమొనర్చి జలప్రళయంలో

ఊళ్ళకు - ఊళ్ళే ఊడ్చి పెట్టిందనా?

మేడల్ని మిద్దెల్ని నేలమట్టంజేసి,

కాలగర్భంలో పూడ్చిపెట్టిందనా?

ఎందుకివ్వాలి వీడ్కోలు?

ఏమని చెప్పాలి వీడ్కోలు?

3. కలకలలాడే కాపురాల్లో కారుచీకటి నింపిందనా?

కిలకిల నవ్వే పసిపాపల్ని నిర్ధాక్షిణ్యంగా చంపిందనా?

సిరులు పండే క్షేత్రాల్ని మరుభూమిగా మార్చిందనా?

జీవకోటికొకేసారి జీవసమాధి కట్టిందనా?

ఎందుకివ్వాలి వీడ్కోలు?

ఏమని చెప్పాలి వీడ్కోలు?

4. కుప్పలు తగలబడిపోతూంటే, పేలాలేరుకు

తినే స్వార్ధపరుల్ని సృష్టించిందనా?

శవాల్ని దోచుకుతినే కిరాతకుల్ని పెంచి,

శవ రాజకీయాల్ని నడిబజారు కీడ్చిందనా?

ఎందుకివ్వాలి వీడ్కోలు?

ఏమని చెప్పాలి వీడ్కోలు?
ఇవ్వక తప్పదు, గావున, యిద్దాంలే వీడ్కోలు,
ఇవ్వటం పరిపాటిగాన, యిద్దాంలే వీడ్కోలు?
మనలకిట్టి చెడురోజులు
మరల మరల రాకుండా
ఇస్తున్నాం వీడ్కోలు, గతమా!
ఇస్తున్నాం వీడ్కోలు.

అదిగో,
క్రొత్త వత్సరం వస్తోంది - క్రొత్త ఆశలను తెస్తోంది,
చిరునవ్వుతో స్వాగతమిద్దాం - సరదాగా స్వాగతమిద్దాం.
స్వాతంత్ర్యం - శాత్యభ్యుదయం,
సర్వోదయ సమతాభావం,
నరజాతిలొ కల్పించాలని,
నవలోకం నిర్మించాలని,
మనమంతా స్వాగతమిద్దాం - మనసారా స్వాగతమిద్దాం!
చిరునవ్వుతో స్వాగతమిద్దాం - సరదాగా స్వాగతమిద్దాం!
పుడమితల్లి పులకలెత్తి పొలుపారగ పండాలని,
కరువు తొలగి దేశంలో సిరి సంపద నిండాలని,
దేశాభ్యున్నతికి ప్రజలు దీక్షబూని లేవాలని,

మానవత్వ మహత్వంబు మహిలో వర్ధిల్లాలని, మనమంతా స్వాగతమిద్దాం!
మనసారా స్వాగతమిద్దాం! చిరునవ్వుతో స్వాగతమిద్దాం - సరదాగా స్వాగతమిద్దాం!

భారతమంతా ఒకటను పరమార్ధం తెలియాలని,
భాషామతసామరస్య బంధముతో కలియాలని,
ప్రజలను మోసంజేసే పాలకులే పోవాలని,
ప్రజాసేవయే ఎల్లరి భవ్యదీక్ష కావాలని,
మనమంతా స్వాగతమిద్దాం - మనసారా స్వాగతమిద్దాం!
చిరునవ్వుతో స్వాగతమిద్దాం - సరదాగా స్వాగతమిద్దాం!

(1978 సంవత్సరం ఆగమన సందర్భములో)

## ఏది ఉగాది?

1. సూర్యగోళం చుట్టి తిరుగుట
భూమిగోళపు ధర్మమేగా!
ఆగకుండా సాగిపోవుట,
కాలచక్రపు మర్మమేగా!

2. బండిచక్రం తిరుగుతుంటే
ఆకులన్నియు జరిగిపోవా?
కాలచక్రం కదలుతుంటే
ఋతువులిలనొగి మారిపోవా?

3. జనన మరణము లెంత సహజమొ,
దినము - రేతిరి యంతె సహజము,
కొండ కోనలు ఎంత సహజమొ,
ఎండ - వానలవంత సహజము.

4. సృష్టి వెలసిన జీవకోటిలా
ఏది ఎక్కువ? ఏది తక్కువ?
దేని వ్యాపారంబు దానిది,
దేని గుణములు దానివేగా!

5. శిశిరఋతువు గతించగా, వా
సంత మిలనేతెంచు గాదా!
ఎండుటాకులు రాల్చి తరువులు
మెండుగా చివురించు గాదా!

6. మ్రోడువారిన వృక్షసంతతి
మోసులెత్తుట సహజమేగా!
మోసులెత్తిన తరులు మరలను
మ్రోడులైన విచిత్రమేమిటి?

7. మావిచివురులు మస్తుగా తిని
కొదమ కోయిల కూయకుండునె?
విరిసి - విరియని విరులతేనియ
గ్రోలి మధుపము సోలకుండునె?

8. నవవసంతుడు తరలిరాగా,
ప్రకృతి కన్నియ పరవశించదె?
రంగురంగుల, రమ్యకాంతుల
పొంగిపోవవె పూలకన్నెలు?

9. ఋతువులన్ని వసంతమైతే,
ప్రకృతిలో ఏముంది అందము?
శిశిరమే లేకున్న యిలలో,
ఆమనిని తలచేది యెవ్వరు?

10. శిశిరమేమి యొనర్చె పాపము?
ఏమి పుణ్యముఁజేసె నామని?
పాత, రోతనిపించునో? మరి,
క్రొత్త వింతగ గోచరించునా?

11.మండుటెండలో మాడినప్పుడే
హాయిఁ గూర్చును ఆతపత్రము,
పెనుదరిద్రములో తపించిన
పెన్నిధియ నానందమొసగును.

12. కష్టపడకయె సుఖము కలుగునె?
కల్గినను యానందముండునె?
చక్రమును ధర అడ్డుకొననిచో,
సాగగలదే, అడుగు ముందుకు?

13.ఎండుటాకులలోని యందము
ఎందరిలఁ జూడంగనేర్తురు?
దళితజీవుల దైన్యగాథలు
ఎందరిల పాడంగఁదలతురు?

14.ఈసురోమని ఎట్టులో మరి
బ్రతుకుబండిని గతుకుబాటను
ఈడ్వలేకను ఈడ్చుకొస్తూ,
ఒక్కక్షణము యుగాదివేళను,

15.ఆగి, ఆలోచనము చేయును
మంచిరోజులు వచ్చునా! యని,
తృటిని, ఆ-లోచనములందున
తటిల్లతలా ఆశమెరయును.

16.క్రొత్త వత్సరమేగుదెంచగ
క్రొత్తయాశలు కూడుమదిలో,
ఎటుల వచ్చునో! అటులే పోవును
ఆశయే అడియాస కాగా!

17. కాలక్రమమున కలుగుచుండును
ఈ ఉగాదులు యాంత్రికముగా,
తెచ్చుచుండును మార్పులెన్నో
ప్రకృతియందున భౌతికముగా.

18.ఈ ఉగాదులు ఎన్ని వచ్చిన
ఇలను మార్పుల వెన్నితెచ్చిన
దానవత్వము మాపగలవే?
మానవత్వము కూర్చగలవే?

19.మానవతయే మంచి మతమని
మనిషి మనసున తలచుటెన్నడో?
మానవతయే మంచి కులమని
మానవతతో మనుటయెన్నడో?

20.దారుణద్వేషాన్ని పెంచే
దానవత్వము వీడుటెన్నడొ?
మనుజులందరు ఒక్కటేయను
మంచిబుద్ధి జనించుటెన్నడో?

21. చెట్టపట్టాలేసుకొంటూ,
మనిషి-మనిషీ నడచుటెన్నడో?
'భాయి! భాయీ! యనుచు ప్రేమతో
పలుకరించుచు పోవుటెన్నడో?
21.నరనరాలలో కరిగిపోయిన
స్వార్థభావము సమయుటెన్నడో?
పరులమేల్ తన మేలనెంచే
భవ్యభావము ప్రబలుటెన్నడో?
22.కూడు-గుడ్డా, కొంప గలిగి,
మనిషి మనిషిగ బ్రతుకుటెన్నడో?
విశ్వమనియెడి వృక్షరాజము
ప్రేమపూలను పూయుటెన్నడో?
23.రాతిగుడిపైనున్న భక్తిని
ఎడద గుడిపై నిలుపుటెన్నడో?
సాటి మానవసేవయే, పర
మాత్మసేవగ తలచుటెన్నడొ?
24.సమసమాజమే ధ్యేయముగ, ఆ
నవసమాజము వెలయుటెన్నడో?
నిండు మమతల గుండె పెంచుక
మనిషి మాధవుడౌట ఎన్నడో?
25.రాజకీయ వినాయకులలో
రంగుమార్పులు తొలగుటెన్నడొ?
పదవికోసం ప్రాకులాటలు
మాని, పరువుగ మనుటయెన్నడా?
26.గురుని దైవముగా, దలంచీ
శిష్యులెప్పుడు సేవ జేతురొ?
శిష్యులను యవ్యాజప్రేమతో,
బోధలెప్పుడు బుజ్జగింతురొ?
27.పదవి, యధికారంబు లిలలో
ప్రజలసేవకు పాటుపడుటకె,
కానిచో, నవి కాలసర్పపు
కోరలని భావించుటెప్పుడో?
28.అప్పుడే, అది, విశ్వమానవ
జీవితానికి నవయుగాది!
కానిచో, యది, కవుల కల్పన
మిగిలె పెనుదగాది.

(1980) (నరసరావుపేట)

## రంగి - రంగడు రాత్రిబడికి

పల్లవి

రంగడు : రావే రంగీ! రావే రంగీ!

రాతిరి బడికెళదామే రావే రంగీ!

రాద్దామే ఓనమాలు రావే రంగీ!

రంగి : పోరా మామా! పోరా మామా!

పోసుకోలు మాటలేల? పోరా మామా!

రంగడు : పడమటీది సావడిలో

బడిని తెరిసినారంట!

సదువురాని పెద్దోళ్ళకు

సదువు సెప్పుతారంట!

రంగీ!

పలకా-బలపం బట్టుకు

బయలుదేరి పోదామే,

పంతులయ్య సెప్పేటి

పాటాలను యిందామే, ॥రావే॥

2

రంగి: తాతలెవరు సదివారు?

తండ్రులెవరు సదివారు?

వయసుమీరిపోయినాక

మనకేటికి సదువులింక?

(అయినా యిప్పుడు)
పలకా బలపం బట్టుకు
బడికి నడిసిపోతుంటే,
పదిమందీ మనని సూసి,
(హవ్వ!) ఫక్కున నగిపోరటరా? ॥పోరా॥

3

రంగడు : ఉత్తరాలు సదవలేము,
బస్సుపేర్లు సదవలేము,
తల్లడిల్లిపోతాము,
సదువుకున్న తెల్లోడు
సెంద్రుడిపై కెళ్ళాడు,
సదువుకోక మనమంతా
సతికిలబడిపొయ్యాము.

4

రంగి : (ఆలోచించి) నిజమే మామా!
పదిరూకలు అప్పిచ్చి,
పదిహేనని రాత్తాడు,
ఏమి రాసెనో తెలవక
ఏలుముద్దరేత్తాము,
బతుకంతా అప్పులోళ్ళ
పాలనెబడి సత్తాము,

అయినా, యీ వయసులోన,
అబ్బేనా మనకు సదువు?

5

రంగడు : ఓనమాలు దిద్దటాని
కొయసుతోటి పనిలేదే!
సదవాలని మనసుంటే,
సదువురాకపోతుందా?
మనిషి సదువులేని నాడు,
మనిషిలాగ బతకలేదు,
బావిలోన కప్పవోలె
బయటి వెలుగు సూడలేదు.

6

రంగి : పదరా మామా! పదరా మామా!
బడికి కలిసిపోదాము! బాగ సదువుకుందాము.

రంగడు : రావే రంగీ! పదరా మామా!

రంగి : పదరా మామా!

రంగడు : రావే రంగీ ! రంగి : పదరా మామా!

(నరసరావుపేట)

## కృష్ణమ్మ (గేయనృత్యం)

స॥ కొండల్లో పుట్టింది కృష్ణమ్మా!
కోనల్లో చుట్టింది కృష్ణమ్మా!
మా పల్లెకొచ్చింది కృష్ణమ్మా!
మాకు సిరులిచ్చింది కృష్ణమ్మా! ॥కొండల్లో॥

1. చెరియవేణిని జూచి చెలువుగా పిలిచింది,
సకియ భీమకు వేడ్క స్వాగతము పలికింది,
తుంగభద్రను తాను తోడుకొని పోయింది,
కమనీయ తెనుగమ్మ కౌగిటను చేరింది. ॥కొండల్లో॥

2. శ్రీశైలవాసునికి చేయెత్తి మ్రొక్కింది,
పాతాళగంగలో పరవళ్ళు త్రొక్కింది.
ఉప్పొంగి యెగసింది, కుప్పించి దూకింది,
దివ్యజ్యోతిని తెనుగుదేశాని కొసగింది. ॥కొండల్లో॥

3. అటువంగె నొకవంక, యిటువంగె నొకవంక,
ఒంపు ఒంపుకు క్రొత్త సొంపులను చూపింది.
హరిణిలా ఒకసారి ఆడింది ఎగిరెగిరి,
కరివోలె ఒకసారి కదలింది మెల్లగా. ॥కొండల్లో॥

4. నాగార్జునాచార్య వాగమృతము గ్రోలి,
బుద్ధదేవుని పుణ్యబోధలను చాటింది,
అమరావతీ శిల్ప యపురూప సౌందర్య
శోభలను తిలకించి, సూటిగా సాగింది. ॥కొండల్లో॥

5. ముక్తేశునెదుట కైమోడ్పుతో నిలిచింది,
వేదాద్రి నరసింహు వేడ్కతో కొలిచింది,
కనకదుర్గకు భక్తి కానుకల నందించి,
కడలి కౌగిలి సొచ్చి కైవల్యమందింది.
కొండల్లొ పుట్టింది కృష్ణమ్మా!
కోనల్లొ చుట్టింది కృష్ణమ్మా!
మా పల్లెకొచ్చింది కృష్ణమ్మా!
మాకు సిరులిచ్చింది కృష్ణమ్మా!

## గౌతమీ మండలం (సంగీతరూపకం)

ప॥ ఇది గౌతమీ మండలం,
ఇది కళారాధకుల కమనీయ మందిరం,
ఇది గౌతమీ మండలం,
ఇది సుజలపూరితం - ఫలపుష్పభరితం.
ఇది సస్యశ్యామలం – సౌభాగ్యనిలయం ॥ఇది॥
1. ఆదికవి నన్నయ్య ఆంధ్రభారతి నొసట
శ్రీకారమును చుట్టి చెలువొందె నిచ్చోట,
సంఘ సంస్కర్తగా, నవ్యయుగకర్తగా
వీరేశలింగంబు విలసిల్లె నిచ్చోట! ॥ఇది॥
2. ఆంధ్ర సంస్కృతి కిలను అగ్రపీఠమ్ముగా,
రాణ్మహేంద్రవరమ్ము రాజిల్లెనిచ్చోట,

ముసలి మగనికి పడుచు పెండ్లాము కూడదని,
సారంగధర చరిత చాటిచెప్పిందిచట. ॥ఇది॥
3. కొండలెన్నో దూకి, కోనలెన్నో నిండి,
భద్రాద్రి రఘురాము పాదాలనర్చించి,
పావనోదక మొసగి, పసిడి పంటల నించి,
సాగరుని చేరింది జనని గోదారిచట. ॥ఇది॥

**(1970) (ధవళేశ్వరంలో)**

## వరద గోదావరి

దండాలు మాయమ్మ గోదావరీ!
కోటి దండాలమ్మ! గోదావరీ! నీకు
శతకోటి దండాలు గోదావరీ! ॥కోటి॥
1. ఎక్కడో పుట్టావు - ఎక్కడో పెరిగావు,
కడలిగర్భంలోన కలసిపోయావిచట! ॥దండాలు॥
2. బండరాళ్ళల్లోన - బడాబడా దొర్లావు,
అడవిదారుల్లోన - అటు యిటూ పొర్లావు, ॥దండాలు॥
3. గట్టుల్ని నరికావు - చెట్టుల్ని పెరికావు,
ఏళ్ళైనా మింగావు - ఊళ్ళెన్నొ ముంచావు! ॥దండాలు॥
4. (విషాదంగా) నిండు సంసారాల - నిప్పచ్చరంజేసి,
వికటాట్టహాసివై - విను వీధికెగసేవు, ॥దండాలు॥
5. ప్రాణాలు గుప్పెట్లొ - పట్టుకొనియున్నాము,

రాతిబొమ్మల్లాగ - పాతుకొని పోయాము. ॥దండాలు॥

6. ప్రళయ ఘోషలూ - నీ విలయ తాండవము,

ఉగ్రరూపమ్మ - నిగ్రహించవే యింక, నీ ॥దండాలు॥

7. నీ హోరు, నీ జోరు, నిలపవే మాయమ్మ!

కరుణించి, మమ్మింక కాపాడవేయమ్మ! ॥దండాలు॥

## 1852లో ఆనకట్టను దర్శించటానికి
## గోదావరి డెల్టా రైతుల యాత్ర

గేయం

ప॥ పోదాము రారండి! మనమందరం!

చూదాము కనులార నవమందిరం! ఆ నవమందిరం! ॥పోదాము॥

1. గోదారి కడ్డంగ - గోడ కట్టారంట!

ఆకాశగంగనే ఆపేసినారంట!

వరదలిక రావంట! కరువులిక లేవంట!

వరదగోదావరే వరదాయినగునంట! ॥పోదాము॥

2. కడలి కౌగిలిలోన కరిగిపోయే గంగ

పుడమి తల్లిని సోకి - పులకలెత్తించునట!

పులకలెత్తిన పుడమి - పొలుపార పండునట!

పాడిపంటలు గల్గి - భాగ్యాలు నిండునట! ॥పోదాము॥

3. ఎటుచూడ బాటలట! ఎటుచూడ తోటలట!
ఈ సీమ రూపమే ఎంతయో మారునట!
ఈ దివ్యమందిరము - ఇల కల్పతరువుగా,
కామితార్థము లొసగి - కలకాలముండునట! ॥పోదాము॥
4. గౌతముడే మనపైన కరుణించి వచ్చాడు.
మహిలోన కాటనుగ మరల జన్మించాడు.
తల్లి భూదేవికీ దాహార్తి తీర్చాడు.
పేదరైతుల కిలను పెన్నిధిని కూర్చాడు. ॥పోదాము॥
5. కాటన్ దొర రూపాన్ని కనులారా కందాము.
ఆ 'అన్నదాత'కు అర్చనలే చేద్దాము.
ఆయయ్యమాటలను ఆనందంగా విందాం,
నిండుభక్తితో దొరకు గుండెల్లో గుడి కడదాం. ॥పోదాము॥
6. ఎందరో శ్రామికులు, ఎందరో కార్మికులు,
ఎన్నో యిడుమలకోర్చి, ఈ యాగం చేశారు.
మహనీయులనందరినీ, మనసారా స్మరియించి,
తలలు వంచి మ్రొక్కుదాము, ధన్యులమవుదాము రండి. ॥పోదాము॥
పోదాము రారండి, మనమనందరం,
చూదాము కనులార నవమందిరం, ఆ
నవమందిరం! ఆ నవమందిరం!

## మారింది కాలం!

వ॥ మారింది కాలం - మారింది దేశం,
మారింది భూమాత రూపం, - ఎంతో
మారింది భూమాత రూపం. ॥ మారింది ॥

1. పొంగి పొర్లింది గోదారి డెందం,
తొంగి చూసింది భూదేవి అందం,
పారిపోయింది ఆనాటి కరువు,
తీరిపోయింది రైతన్న బరువు. ॥ మారింది ॥

2. ఊగులాడింది నడిచేలో హలము,
తూగిపండింది బంగారు పొలము,
వెల్లివిరిసింది పల్లెల్లో జీవం,
కళ్ళు తెరిచింది అభ్యుదయ భావం. ॥ మారింది ॥

3. నిండి పారాయి కాల్వల్లో నీళ్ళు,
పండి నిండాయి తరులెల్ల పళ్ళు,
వాడ, వాడల్లో వెలిశాయి బళ్ళు,
పాడిపంటల్లో నిండాయి వూళ్ళు. ॥ మారింది ॥

4. పరిమళించింది మందారకుసుమం,
పరవశించింది మత్తెక్కి భ్రమరం,
ఇంపుగూర్చాయి పీకకూజనాలు
సొంపు దాల్చాయి కదళీవనాలు. ॥ మారింది ॥

## కాటన్ దొరా!

ప॥ కాటన్ దొరా! ఓ కాటన్ దొరా!

ఎంత దొడ్డమనిషివయ్య కాటన్ దొరా!

ఎంత మంచిమనసు నీది! కాటన్ దొరా!

1. నీ దేశం కానిచోట - నిలచి పాటుపడ్డావు.

సకల లోకకళ్యాణం - సదా నీవు కోరావు. ॥కాటన్॥

2. మా భాగ్యం దోచుకొనగ - మా దేశం వచ్చినట్టి

తెల్లజాతివాడివైన - తెలుగుదేవరైనావు. ॥కాటన్॥

3. వరదల నరికట్టావు - కరువులు పోగొట్టావు.

మా భాగ్యం పెంచావు - మా యిలవేల్పయినావు! ॥కాటన్॥

4. ఇంత పెద్ద ఆనకట్ట - ఎలా కట్టినావయ్యా?

పరుగెత్తే గోదారిని - ఎలా పట్టినావయ్యా? ॥కాటన్॥

5. ఎంతమంది ఘర్మజలం - ఈ మట్టిలో కలిసిందో?

ఎంతమంది ధర్మజలం - ఈ కట్టలో నిలచిందో! ॥కాటన్॥

6. ఈయపూర్వ నిర్మాణం - నీ ప్రతిభకు తార్కాణం

నిలచె శతాధిక వర్షం - నిలిపె నిలను నీ నామం ॥ ॥కాటన్॥

7. నిష్కల్మష హృదయంలో - నిర్మల భావాల నింపి,

నిస్స్వార్థం ప్రదర్శించి - నీ ఘనతను చాటావు. ॥కాటన్॥

8. ఏనాటిదో ఈ బంధం? ఏ జన్మదో అనుబంధం?

ఏ మహర్షి అంశంలో - యిలను అవతరించావో? ॥కాటన్॥

9. నీ ప్రతిభకు, నీ ఘనతకు - జోహారులనర్పిస్తాం

నీ నిరుపమ మానవతకు నీరాజనమర్పిస్తాం. ॥కాటన్॥

10. మంచి మనిషి పరమాత్ముని - మరో రూపమని నమ్మి,
నిన్నే తలచుచుందుమయ్య - నిన్నె కొలుచుచుందుమయ్య! ॥కాటన్॥

11. మా మదిలో నిలచి సతము - మమ్ముల నడిపించుమయ్య!
మాకు శక్తియుక్తులొసగి, మమ్ముల దీవించుమయ్య! ॥కాటన్॥

కాటన్ దొరా! ఓ కాటన్ దొరా!
ఎంత దొడ్డమనిషివయ్య! కాటన్ దొరా! అహ!
ఎంత మంచి మనసునీది కాటన్ దొరా!

## మానవత్వం

1. మహిత సత్యం - మానవత్వం,
సమహితత్వం - మానవత్వం,
ప్రేమ, మైత్రి, పరోపకారపు
మేలు కలయిక మానవత్వం. ॥మహిత॥

2. మంచి మతమిల మానవత్వం,
మంచి కులమిల మానవత్వం,
మతమునెంచక కులమునెంచక
మంచిచేయును మానవత్వం. ॥మహిత॥

3. జాతి, మతద్వేషాగ్ని కీలలఁ
జల్లబరచును మానవత్వం,
సమరభీతినడంచి జగతికి,
శాంతిఁగూర్చును మానవత్వం. ॥మహిత॥

4. దిక్కుమాలిన దీనజనులకు
దిక్కుతాఁనగు మానవత్వం,
గోడుఁజెందు యభాగ్యజీవుల
కేడుగడయగు మానవత్వం. ॥మహిత॥

5. విశ్వమంతయు నొక్కయిల్లని,
విశ్వసించును మానవత్వం,
విశ్వమానవ సమత, మమతల
విశ్వరూపమె మానవత్వం. ॥మహిత॥

6. దళితజీవుల సేవలో పర
మార్థభావమే మానవత్వం,
ఆత్మలో పరమాత్మ రూపము
గాంచునదియే మానవత్వం. ॥మహిత॥

7. అపకరించినవారికైనను
ఉపకరించుటే మానవత్వం,
ఆర్తజీవి కయాచితముగా
సాయపడుటయె మానవత్వం. ॥మహిత॥

8. మనుజులందరు నొక్కటేయను
మహితభావమే మానవత్వం,
నీతిమార్గమునందు మనుజుని
నిల్పునదియే మానవత్వం. ॥మహిత॥

9. హేతుభూతము నెంచి, ఏరిచి
విశ్వసించుటే మానవత్వం.
విశ్వసించిన సత్యమెన్నడు
వీడకుండుటె మానవత్వం. ॥మహిత॥

10. భావదాస్యముఁ బాపి, మనిషికి
స్వేచ్ఛనొసగును మానవత్వం.
మనిషినున్నత మానవునిగా
మలచునదియే మానవత్వం. ॥మహిత॥

## ఆంధ్రప్రశస్తి

1. తెలుగు యోధుల ధీరగాధలు
తెలుగు వనితల తెగువ బిగువులు,
తెలుగు నేతల దివ్యచరితలు
తెలుగు కవితల తేనెసోనలు
తెలుసుకోరా తమ్ముడా!
తెలుసుకోవే చెల్లెలా!

2. ఆంధ్రసంస్కృతి కాకరమ్మై,
వివిధ కళలకు వెలుగుబాటై
సంఘ సంస్కరణలకు నెలవై
వాసికెక్కెను రాణ్మహేంద్రము. ॥తెలుసు॥

3. ఆదికవి నన్నయ్య భారత
రూపురేఖలు దిద్దెనిచ్చట,
ఆంధ్రనాటక కళావేదిని
చిలకమర్తి యలర్చె నిచ్చట. ॥తెలుసు॥

4. చిత్రకళకెన్నెన్నో చిన్నెలు
కూర్చెనిట 'దామెర్ల పీఠము',
ముసలి మగనికి పడుచు భార్యయు
కూడదనె 'సారంగ చరితము'. ॥తెలుసు॥

5. గౌతమీనది కానకట్టను
కట్టి, బంజరునేలనెల్లను
సుజలపూరిత సస్యశ్యామల
ధాత్రిగా నొనరించె 'కాటను'.

6. బాల్యమందున పతులబాసీ
గతుల కానని కన్నె విధవల
నుదుట కుంకుమదీర్చి బ్రతుకుల
వెలుగునింపెను 'కందుకూరి'.
7. కాసులకు నాశించి కన్నెల
ముసలి మగలకు కట్టబెట్టెడు
దురాచార కరాళ, రక్కసి
కోరలను గురజాడ విరిచెను.
8. హింసకును ప్రతిహింస తగునని,
మన్యవిప్లవదళము గూరిచి,
ఆంగిలేయుల నడలగొట్టెను
వీరసీతారామరాజిల.
9. అబలలను సబలలుగ జేయగ
చదువులేనిదె సాధ్యపడదని,
ఆంధ్రమహిళాసభల నిలిపి
సేవజేసెను 'దుర్గబాయమ'.
10. సకల కళల సమన్వితం
విశ్వవిద్యాలయము నేరిచి,
తెలుగుజాతికి ఖ్యాతి గూర్చెను
'కట్టమంచి' కళాభిరూపుడు.

11. బ్యాంకులను స్థాపించి ప్రజలకు
మేలుగూర్చెను మేటినేత
కార్యదక్షుడమేయచరితుడు
దిట్ట, మన పట్టాభిరాముడు.
12. శిష్యులకు నాదర్శగురువై
సంఘసంస్కరణలకు నిరవై,
బ్రాహ్మ్యధర్మ ప్రచారకుడునై,
వెలసె రఘుపతి వేంకటార్యుడు.
13. ఆంధ్రజాతిని మేలుకొల్పగ
'ఆంధ్రపత్రిక గూర్చి యిలలో
ఘనుడు, కాశీనాథ నాగే
శ్వరుడు వెలసెను 'విశ్వదాత'గ.
14. 'ఎందు', 'కెట్టుల' ననెడు ప్రశ్నల
నేర్పి, ప్రజలను మేలుకొలిపి,
సు'కవిరాజు'గ వాసికెక్కిన
అమరచరితుడు త్రిపురనేని.
15. ఎందరో 'కవిచక్రవర్తులు',
ఎందరో నటకావతంసులు,
ఎందరో వీరాధివీరులు,
ఈ ధరిత్రిని యుద్భవించిరి.
తెలుసుకోరా తమ్ముడా!
తెలుసుకోవే చెల్లెలా!

## మా దేశం - మా దేశం (గేయం)

మా దేశం! మా దేశం!

భారతదేశం, మా దేశం! ॥మా దేశం॥

1. కర్మభూమి మా దేశం - ధర్మభూమి మా దేశం,
   జగతికి విజ్ఞానమొసగు జగద్గురువు మా దేశం. ॥మా దేశం॥

2. ఏ పూర్వపు జన్మలలో ఏ తపస్సు చేశామో?
   పూర్వపు జన్మలలో ఏ పుణ్యం చేశామో?
   ఎంతటి యదృష్టఫలమో? ఇక్కడ జన్మించినాము. ॥మా దేశం॥

3. ఇది ఒక అందాలతోట, ఇది ఒక రత్నాలపేట,
   ఏ దేశం సరిరాదుర! ఈ దేశపు విభవానికి,
   ఇది భూలోకపు స్వర్గం - ఇది మోక్షానికి మార్గం. ॥మా దేశం॥

4. ఇది క్షాత్రం! ఇది ధర్మం - ఇది సత్యాగ్రహ సమరం,
   అణుశక్తిని మించినట్టి - ఆయుధమ్ము ఆత్మబలం,
   అది అజేయమని జగతికి నిరూపించె మా దేశం.

మా దేశం - మా దేశం భారతదేశం - మా దేశం.

## బాలలం - బాలలం - భావిపౌరులం! (గేయనృత్యం)

బాలలం, బాలలం, భావిపౌరులం!
పాపలం, పాపలం - చంటిపాపలం!
మీ కంటిపాపలం! ॥బాలలం॥

1. అన్ని మతాలను మించిన మానవతే మా మతం,
అన్ని కులాలను మించిన మానవతే మా కులం. ॥బాలలం॥

2. గౌతమబుద్ధుడు నేర్పిన ధర్మపథమె మా పథం,
గాంధీజీ బోధించిన సత్యాగ్రహమాయుధం,
పండిత జవహర్ నేర్పిన పంచశీల మా మంత్రం,
ఇందిరమ్మ కలలుగనే సోషలిజం మా గమ్యం. ॥బాలలం॥

3. అన్యాయాన్నెదిరిస్తాం - అక్రమాల్ని తొలగిస్తాం,
న్యాయం, ధర్మం కోసం - ప్రాణమైన అర్పిస్తాం,
కుల, మతాల కుడ్యాలను కూల్చుతాం, కూల్చుతాం,
మానవులంతా ఒకటని చాటుతాం - చాటుతాం. ॥బాలలం॥

4. సమసమాజ నిర్మాణమె మా ధ్యేయం, మా ధ్యేయం,
నవసమాజ నిర్మాణమే మా లక్ష్యం - మా లక్ష్యం. ॥బాలలం॥

5. పరిపాలన మాదైతే, శాంతి నిలను స్థాపిస్తాం,
పరిపాలన మాదైతే, క్రాంతి నిలను సృష్టిస్తాం,
పరిపాలన మాదైతే, స్వాతంత్ర్యం అందరిదీ,
పరిపాలన మాదైతే, సుఖ, శాంతులు అందరివీ. ॥బాలలం॥

6. చెడ్డనెపుడు ఛేదిస్తాం - మంచినెపుడు సాధిస్తాం,
మా చల్లని మనసుల్లో భగవంతుని బంధిస్తాం.
బాలలం - బాలలం - భావిపౌరులం!
పాపలం - పాపలం - చంటిపాపలం!
మీ కంటిపాపలం!

(నవంబరు 14, 1973) (బలిమెల ప్రాజెక్టు వద్ద)

## రైతుసంఘాలు వచ్చాయి (గేయం)

ప॥ వచ్చాయండీ, వచ్చాయి,
నీటిసంఘాలు వచ్చాయి,
తెచ్చాయండీ తెచ్చాయి,
రైతుకుమంచిని తెచ్చాయి! ॥వచ్చా॥

1. రైతువర్గ సంక్షేమము కొరకై,
రైతుప్రతినిధుల నాయకత్వమున,
రైతులెల్లరును సభ్యులుకాగా,
రైతుల ఐక్యతకే ప్రతీకగా! ॥వచ్చా॥

2. 'కాల్వలు మావే! తూములు మావే!
నీటిపారుదల వ్యవస్థ మాద'ని,
యాజమాన్య స్పృహ నెడద నింపుకొని,
రైతన్నలు యెలుగెత్తి చాటగా! ॥వచ్చా॥

3. గుత్తదారులకు పెత్తనమీయక,
పనులయందు నాణ్యతను పెంచగా,
మరమ్మతులను తామే చేయుచు,
పంటకాలువల పరిరక్షింపగ! ॥వచ్చా॥

4. ఎగువ రైతులకు ఎక్కువనీయక,
దిగువ రైతులకు తక్కువనీయక,
రైతులెల్లరకు సమధర్మముగా,
సాగునీటి నందించు ధ్యేయముతో! ॥వచ్చా॥

5. నీటిపారుదల నిర్వహణములో
పలు సమస్యలను పరిష్కరించుచు,
అన్నదాతలౌ రైతన్నల కిల
శాంతి, సంపదలు సమకూర్చుటకై,
వచ్చాయండీ! వచ్చాయి,
నీటిసంఘాలు వచ్చాయి,
తెచ్చాయండీ, తెచ్చాయి,
రైతుకు మంచిని తెచ్చాయి.

## నీటి కథను చెబుతాను వినుకోండయ్యో!

ప॥ రామయ్యన్నో! ఓ రంగయ్యన్నో!
సుబ్బమ్మక్కో! ఓ సూరమ్మతో!
నీటికథను చెబుతాను, వినుకొండయ్యో! ఓ
మేటికథను చెబుతాను, వినుకోండమ్మో! ॥రామ॥
1. పంటలు పండాలంటే నీరము కావాలండీ!
దప్పిక తీరాలన్నా నీరము కావాలండీ!
జీవరాశి మనుగడకే నీరము కావాలండీ!
నీరములేనట్టి పుడమి నిర్జీవమె యగునండీ! ॥రామ॥
2. ప్రకృతి మాత కోరకయే ప్రజలకిచ్చు వరాలెన్నో,
వర్షపాతమందులో నమూల్యవరము మనకన్నా!
అవనిపైన నున్ననీరు - యపరిమితము కాదన్నా!

పొదుపుగ నుపయోగించిన పొందుపాటు కలదన్నా! ॥రామ॥
3. తిండి హెచ్చు-తగ్గులైన దేహము పాడైపోవును,
నీరెక్కువ, తక్కువైన నీరసించు పంటభూమి,
తగుపాళ్ళలో తిన్నయెడల తనువుకు బలమిచ్చు తిండి,
తగురీతిని నీరమిడిన, తెగ పండును పంటభూమి! ॥రామ॥
4. నీరెంతో అరుదైనది, నీరెంతో విలువైనది,
నీటిని పొదుపుగ వాడుట, నీ బాధ్యత కదరన్నా!
అధికముగా నీరమిడిన, అధిక ఫలము రాదన్నా!
నీటిని వ్యర్థముచేయుట నేరములన్నింట మిన్న! ॥రామ॥
5. కాల్వకెగువ పొలమైనా, కాల్వనిండ నీరున్నా,
నీ వాటా నీటిపైనె నీకుండును హక్కన్నా!
ఎక్కువగా నీరు పెట్టి ఏటిపాలు చేయకన్న!
దిగువనున్న రైతులకది తీరని ద్రోహం బన్నా!
6. డ్యాములెన్నొ కట్టారు - కాలువలను త్రవ్వారు,
సాగవేసి మీ పల్లెకు సాగునీటినిచ్చారు,
అది సువర్ణ ద్రవమండీ! అతిపొదుపుగా వాడండీ!
అధిక ఫలమునందండీ! ఆనందమై మీరండీ!

రామయ్యన్నో! రంగయ్యన్నో!
సుబ్బమ్మక్కో! సూరమ్మత్తో!
నీటికథను చెబుతాను వినుకోండయ్యో! ఓ
మేటికథను చెబుతాను వినుకోండమ్మో!

# కలిసి నడుద్దాం! (సంగీతరూపకం)

(1982లో ఆకాశవాణి, విజయవాడ కేంద్ర ద్వారా ప్రసారితం)

''గురుర్రహ్మ, గురుర్విష్ణో, గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ, తస్మైశ్రీ గురవే నమః''
ఆనాడు గురుపూజాదినోత్సవం.

ఉత్తమ అధ్యాపకుడిగా గుర్తింపునంది, రాష్ట్రపతి ప్రశంసాపత్రం నొందిన వెంకట్రామయ్య మాస్టారిని అభినందించటానికి గ్రామ ప్రజలు, పెద్దలు, విద్యార్ధులు మాస్టారింటికి వచ్చారు.

అందరు : నమస్కారం మాస్టారూ!

మాస్టారూ: నమస్కారం; నమస్కారం. రండి! కూర్చోండి!

ఒక పెద్ద: మీరు ఉత్తమ అధ్యాపకులుగా గుర్తింపబడి, రాష్ట్రపతి ప్రశంసాపత్రం పొందటం, మా గ్రామానికే గర్వ కారణం పంతులుగోరు!

రెండవ పెద్ద : విద్యార్ధులను మీ సొంత బిడ్డల్లా చూసుకొని, విద్యాబుద్ధులు గరపుతున్న మీకంటే ఉత్తమ అధ్యాపకులెవరుంటారు మాస్టారూ!

విద్యార్ధులు : మీలాంటి మహనీయులకు శిష్యులమని చెప్పు కోటానికే మాకెంతో గర్వంగానూ, ఆనందంగానూ వుంది మాస్టారూ!

మాస్టారు : మీ అభిమానానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి. ఈనాడు నాకెంతో ఆనందంగా వుంది.

మరో పెద్ద: ఈ శుభ సమయంలో నలుగురికి ఉపయోగపడే ఏవైనా రెండు మంచిమాటలు మీనోటినుండి వినాలనుంది.. చెప్పండి, పంతులుగోరూ!

మాస్టారు: అలాగే చెప్తాను. వినండి!

మానవుడు సంఘజీవి - దైనందిన జీవితంలో ఆతని కెన్నో సమస్య లెదురవుతూ వుంటాయి. ఒక్కడుగా పరిష్కరించలేని ఎంతటి క్లిష్ట సమస్యనైనా, పది మందీ. కలిస్తే, అవలీలగా పరిష్కరించగలుగుతారు. "సహకారం - సమతాభావం - సమైక్యత.''

ఈ మూడు మానవాళి సుఖ, శాంతులతో జీవించటానికి అవసరమైన జీవన విధానాలు.

'సహకారం' అనగానే, 30 సంవత్సరాల క్రిందట జరిగి సంఘటనే నాకు గుర్తుకి వస్తుంది.

అందరు : అదేమిటో చెప్పండి మాస్టారూ!

మాస్టారు : చెబుతాను. అప్పుడే అధ్యాపకుడిగా చేరటానికి నేనీ వూరు వచ్చాను. అప్పటికిక్కడ. స్కూలు మాత్రమే వుంది. పాఠాలు చెప్పటానికి ఒకే తాటాకుపాక. ఒక చిన్న ఎలిమెంటరీ అదిగూడ నేను వచ్చేటప్పటికి, గాలి వానకు కూలిపోయి, దీనంగా చూస్తోంది. దాని సంగతి పట్టించుకొన్న నాధుడే లేడు. పిల్లలు బడి మానేసి, వీధుల వెంట తిరగడం తప్ప, వారికి వేరే పనే లేదు. పెద్దలకు పిల్లలేం జేస్తున్నారన్న ధ్యాసే లేదు. పరిస్థితులలో ఏదో ఒకటి చెయ్యాలన్న తపన నాకు కలిగింది. అప్పుడు గ్రామస్తులను పదిమందిని ఒకచోట చేర్చాను. (గతంలోకి)

మాస్టారు : సోదరులారా! ప్రగతికి విద్య మూలం.

చదువు - సంస్కారం లేకుండా, ప్రపంచంలో ఏ వ్యక్తి గానీ, జాతి గానీ జీవితంలో పైకి రాలేదు. అదుగో! ఆ పాక చూడండి! అది పడిపోయి, నాలుగు నెలలైనా. మీరెవ్వరూ దాని అతీ, గతి పట్టించుకోవటం లేదు. పిల్లలు చదువుసంధ్యలులేక, చెట్ల వెంట, పుట్ల వెంట పడి తిరుగుతున్నారు. పెద్దలైన మీరీ విషయం పట్టించు కొనకపోతే ఎలా? మీరే ఒకసారి ఆలోచించండి!

ఒకరు : గవర్నమెంటోళ్ళు ఈ పాకను బాగు చెయ్యకపోతే, మేమేం చేస్తాం పంతులుగోరూ?

మాస్టారు : అదే పొరపాటు. ప్రతి చిన్నపనికి ప్రభుత్వం మీద ఆధారపడితే, జరిగేది యింతే మరి! మీరందరు కలిసివస్తే ఈ పాక నిలబెట్టటం ఏమంత కష్టం గాదే!

అందరు: సరే! ఇప్పుడు మమ్మల్నేం చెయ్యమంటారో చెప్పండి! మాస్టారూ! మీరేం చెప్పినా చెయ్యటానికి మేం సిద్ధం!
మాస్టారు: సంతోషం! ఇప్పుడు ఈ పాకను నిలబెట్టటానికి కావలసింది ముఖ్యంగా, కర్ర, తాటాకు, గడ్డి, యింకా శ్రమశక్తి. మరి యివన్నీ మన దగ్గరున్న వస్తువులే గదా! వీటిలో మీరెవరెవరు ఏమేమి యిస్తారో, మీరే ఆలోచించుకొని చెప్పండి!
ఒకరు : నేను పాకకు కావలసిన తాటాకు తోలిస్తాను మాస్టారు
రెండోవాడు: కావలసిన బాదులు, వాసాలు నేను పంపిస్తాను.
మూడవ : గడ్డి తోలించే పని నాది మాస్టారూ!
నాల్గవ : నాకు వడ్రంగం పని వచ్చు. నేను కర్రలు చెక్కి పా బిగిస్తానండయ్యా!
తక్కినవారు: మేమంతా శ్రమదానం చేసి పాకను నిలబెడతాం! (వర్తమానంలోకి)
మాస్టారు : అంతే! అందరూ తలొక చెయ్యి వేశారు. వారం రోజుల్లో పాక తయారయింది. పిల్లలు బడికి రావటం మొదలయింది. వారు శ్రద్ధాసక్తులతో చదువుకున్నారు. అనతికాలంలోనే ఆ చిన్న బడి, ఈనాడింత పెద్ద ఉన్నత పాఠశాలగా రూపొందింది. ఈ జిల్లాలోనే గాక, రాష్ట్రంలోనే ఉత్తమ పాఠశాలగా విశిష్టతను సంపాదించుకుంది. ఈ పాఠశాలలో చదివిన విద్యార్థులలో ఎంతో మంది ఇంజనీర్లు, డాక్టర్లు, లాయర్లు, శాస్త్రజ్ఞులు ప్రపంచఖ్యాతి గడించారు. గర్విస్తున్నాను. అందుకు నేనెంతో గర్విస్తున్నాను.
ఆనాడు పదిమందీ కలిసిరాబట్టేగదా! ఈనాడీ పాఠశాల ఇంత అభివృద్ధిలోకి వచ్చింది.

కాబట్టి, మనమంతా అదే స్ఫూర్తితో, ఎల్లప్పుడూ పరస్పర సహకారంతో పనిచేద్దాం! ఒకే మాటపై నిలబడదాం! ఒకే బాటలో కలిసి నడుద్దాం! జయం మనదే!

గేయం : కలసి నడవరోరన్నా! కలసి నడవరా!

వెనకబడితె నీవింకా వెనకేనన్నా!

నీకు సుఖమే సున్నా! ॥కలసి॥

1. చీమ నుండి నేర్చుకో, చెలిమంటే ఏమిటో!

కాకి నుండి నేర్చుకో, కలయికనేదేమిటో!

ఒక్కడె కూర్చొని తింటే ఒంటబట్టబోదురా!

అందరితో కలసి తింటే - ఆనందం వుందిరా! ॥కలసి॥

2. పదిమందితో కలిసుంటే - ప్రతిరోజొక పండుగరా!

పదిమందితో చావైనా, పెళ్ళివంటిదే గదరా!

కలసిమెలసి యుండలేని - బ్రతుకదేమి బ్రతుకురా!

ఒంటరిగా పాడుకొనే - పాటదేమి పాటరా!

3. చేయి-చేయి కలపరా! అడుగులొ అడుగెయ్యరా!

చిరునవ్వులు కురియరా! సిరులెన్నో పెరుగురా! ॥కలసి॥

పెద్ద : చాలా బాగుంది. తర్వాత చెప్పండి మాస్టారూ!

మాస్టారు: చెబుతాను. వినండి! రెండోది, సమతాభావం సృష్టిలో మానవులంతా సమానులే.

ఒక వ్యక్తి : : అదెలా పంతులుగోరూ? పెద్దకులంవాళ్ళు పెద్దోళ్ళు చిన్నకులంవోళ్ళు చిన్నోళ్ళు. అంతేగానీ, అందరు సమానమెట్టా అవుతారండీ?

మాస్టారు : మన సమాజంలో నేడున్న అసమానతలను సృష్టించింది. యీ కులాలు, మతాలే.

- అవి మనిషికి, మానవతకు మధ్య నిలిచిన అడ్డుగోడలు.

- సాటిమనిషిని, మనిషిగా చూడనీయని నీలినీడలు.

- మనుషుల మధ్య ఈర్ష్యాద్వేషాలను పెంచి. సర్వ మానవ సౌభ్రాతృత్వాన్ని మంటగలిపే మహమ్మారులు, - ఒక మతం వాడికి మరో మతం వాడిని చూస్తే ఒళ్ళు

మంట,

- ఒక కులం వాడికి మరో కులం వాడిని చూస్తే తెగులు, ఎవడికి, వాడికి, తానేదో ఎక్కువనీ, ఎదుటివాడు తక్కువనే న్యూనతాభావం,

- పోనీ, అలాగని, ఒకే మతం వారినైనా, ఒకే కులం వారినైనా మైత్రీసూత్రంతో బంధించి వుంచగల శక్తి. ఏ మతానికైనా, ఏ కులానికైనా వుందా? అంటే అదీ లేదే!

అదే వుంటే, ప్రపంచంలో ఒకే మతం పాటించే దేశాలు

ఈనాడెందుకిలా కొట్టుకు చస్తున్నె?

ఒకే కులంలో కూడా, ఎందుకీనాడిన్ని కుమ్ములాటలు? మరి మనిషి కే విధంగానూ మేలుచేయని ఈ మతాలు, కులాలు మనకెందుకు?

- మానవత్వాన్ని మంటగలిపి, సాటి మనుషుల కుత్తుక లుత్తరింపజేసే ఈ దుష్టమతాలు,

- ఒకే మతం వారినైనా, సోదరభావంతో దరిజేర్చుకో నీయక, సమాజం నుండి వెలివేస్తున్న ఈ కుళ్ళు కులాలు మనకొద్దు.

మనందరిదీ ఒక్కటే మతం - అదే మానవ మతం. మనందరిదీ ఒక్కటే కులం - అదే మానవ కులం.

అప్పుడే సమాజమనే మహావృక్షం ప్రేమ పుష్పాలను విరియబూస్తుంది. మానవత్వం పరిమళిస్తుంది. అందుచేత, మనమంతా గదులెరుగని, చెదలెరుగని

ఎదను పెంచుకొందాం!

మమతలతో మనసుల నింపి, మానవులుగా మసలుదాం!

గేయం 1) ఎదనిండా గదులు కట్టి - గదినిండా చెదలు పెట్టి మత్సరాల రెచ్చగొట్టి - మానవతను మట్టుబెట్టి మారణాల సృష్టించే - మతమెందుకురా? కుమ్ములాటలను పెంచే కులమెందుకురా?

॥ఎద॥

2) గుణంలేని కులమెందుకు? - మమతలేని మతమెందుకు? మనిషిని, మనిషిగ జూడని - మతమెందుకు? కులమెందుకు? కులమతాల కుడ్యాలను కూల్చివేయరా! మానవులంతా ఒకటని చాటిచెప్పరా!

3) మానవతే పెద్ద కులం - మానవతే గొప్ప మతం, మంచితనం నిండియున్న - మనసే ఒక మందిరం, ఆ సుందర మందిరాన, ఆత్మజ్యోతి వెలిగించర దళితజనుల సేవజేసి, ధన్యుడవై వెలుగొందర! ॥ఎద॥

అందరు : తర్వాత చెప్పండి మాస్టారూ!

మాస్టారు: ఇక మూడోది సమైక్యత.

- ఏ కుటుంబం గానీ, సమాజం గానీ, దేశం గానీ సమైక్యతతో ముందుకు సాగితేనే, అది సుఖ, శాంతులతో వర్ధిల్లుతుంది. అలాగాక, ఏటికొకరూ, కోటికొకరూ లాగుతూపోతే, ముందుకు సాగలేరు.

- పైగా, అడుగడుగునా, ఎదురుదెబ్బలే తగులుతాయి. ఇది మనకు గత చరిత్ర నేర్పిన గుణపాఠం.

- ఇంతటి సువిశాలమైన మనదేశం ఎన్నో శతాబ్దాల పాటు విదేశీ పాలనలో మ్రగ్గవలసి వచ్చిందెందు చేత?

- గుప్పెడుమంది బ్రిటీషువారు, కోట్ల కొలది భారతీయులపై, వందలకొలదీ సంవత్సరాలు అధికారం చలాయించగలిగారెందుచేత?

- మనలోని అనైక్యత, వ్యక్తిగత స్పర్ధలే దీనికి కారణం. - దేశద్రోహి, అంభి కుతంత్రం పన్నకపోతే, అలెగ్జాండర్ పురుషోత్తముని గెలవగలిగేవాడా?

- వ్యక్తిగత విద్వేషంతో, స్వార్ధబుద్ధితో జయచంద్రుడు. - సాయం చెయ్యకపోతే, మహమ్మద్ ఘోరీ పృథ్వీరాజును జయించేవాడా? మనలోని

అనైక్యతే, మన పాలిటి శాపమయ్యింది. అనేక శతాబ్దాలపాటు జీవంలేని శిలల్లా పడియున్నాం. తరువాత కళ్ళు తెరిచాం చుట్టూ - ప్రపంచాన్ని చూచాం. సమైక్యత లేనిదే, స్వాతంత్ర్యం రాదని గ్రహించాం!

కవులు- కళాకారులు, కార్మికులు కర్షకులు, - విద్యార్థులు - ఉద్యోగులు, పురుషులు - స్త్రీలు, రాజకీయ నాయకులు, ఆబాలగోపాలం, ఒకే మాటపై నిలిచింది. ఒకే బాటపై నడచింది. స్వాతంత్ర్యం సంపాదించుకొంది.

ఆనాడు మనం ప్రదర్శించిన సమైక్యతే, ఈనాడు మన జీవనవిధానం కావాలి.

- అప్పుడే మనదేశం ప్రగతిపథంలో పయనిస్తుంది. ప్రపంచదేశాల్లో తలెత్తుకొని, గర్వంగా తిరగ్గలుగుతుంది.

గేయం : సహకారం, సమైక్యతే, సంఘానికి కోటరా! వేఱుపాటు ధోరణియే, ఆ కోటకు బీటరా!

1. ఐదు వ్రేళ్ళ బలిమి వలన - హస్తము పనిజేయురా! ఆ వ్రేళ్ళే కలియకున్న - హస్తమేమి చేయునురా? గాలికెగిరి పోవు వట్టి - గడ్డిపోచ జూడరా ! ఆ పోచలె వెంటిగయై హస్తినైన గట్టునురా!

2. అంతఃకలహాలె జాతి యధోగతికి మూలమురా! ఐక్యతతో నున్న జాతి - కవని ఎదురులేదురా, పోరువలన నష్టమురా! పొందువలన లాభమురా! గతచరిత్ర పాఠాలను కళ్ళుదెరచి చూడరా!

3. మతములెన్నియున్నా - అభిమతమొకటై యుండాలి! భాషలెన్నియున్నా - మన భావమొకటే కావాలి, ఒకే చోట పువ్వులమై - ఒకే తల్లి బిడ్డలమై, పరిమళాలు నింపుదాం - తరతమాలు చంపుదాం!

అందరు : చాలా బాగా చెప్పారు మాస్టారూ!

విద్యార్థులు : నేటినుండి మేమంతా మీరు చెప్పినట్లుగానే నడచు కొంటాం - సహకారం - సమతాభావం సమైక్యతతో ముందుకు సాగుతాం! దేశాన్ని ప్రగతిపథంలో నడిపిస్తాం!

ఇదే మా శపథం!